# కదంబమాల

(కథల సంపుటి)

మోహన్ కుమార్

ప్రేమాలయ ప్రచురణలు
రాజమండ్రి

ప్రేమాలయ ప్రచురణ
ప్రథమ ముద్రణ
శోభకృత్ 1963
1000 ప్రతులు.

మూల్యం :
రెండురూపాయలు




ముద్రణ :
శ్రీ రామాంజనేయ
ప్రింటింగ్ వర్క్స్,
రాజమండ్రి.

నాపట్ల విశేష ఆదరాభిమానాలు కురిపించే

ఆదర్శ దంపతులు

అన్నయ్య, వదినలు

శ్రీ మన్యం రామమోహనరావు,

శ్రీమతి రాజేశ్వరి గార్లకు

ప్రేమపూర్వకంగా...

—మోహన్‌కుమార్.

# ఇందులో

మంచుతెర

నీటిబుడగ

వలపుతెమ్మెర

స్త్రీ వంటియింటి

బానిసకాదు !

1



అర్థరాత్రివేళ......

పేగులు కొరుక్కుతినే హేమంతపు చలిలో ఒంటరిగా నడచిపోతున్నది ఒక యువతి మున్నేటి తీరంలో. అక్కడక్కడ కార్పొరేషన్ వారి విద్యుద్దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి. ఆ వెలుతురులో ఆమె రూపం అస్పష్టంగా కనిపిస్తూ ఉంది.

ఆమె అక్కడికి ఎందుకు వస్తున్నదో, ఏమి చెయ్యబోతున్నదో—కాస్త ఎడంగా చీకట్లో కూర్చున్న ప్రకాష్‌కు లీలగా అర్థమవసాగింది.

కెరటాల ఘోష దిక్కులేనివాడి ఆర్తనాదంలా ఉన్నది.

"ఆగు!"

ఆమె ఆగలేదు. నడక తగ్గలేదు. గాలికంటె తేలికగా, ఆలోచనకన్న వేగంగా ఆమె నడుస్తూ ఉంది.

"ఆగు!" మళ్ళా అరిచాడు ప్రకాష్.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగిందామె. అపరిచిత వ్యక్తిని చూసి ఆశ్చర్యము, భయముకలిగి కంపించింది.

"ఎవరు నువ్వు?"

'తను ఎవరైతే అతనికెందుకూ?' ఆమె అనుకుంది మౌనంగా. అతని ప్రశ్నకు జవాబు ఇవ్వలేదు.

"ఈ చీకటిరాత్రి, అందునా విపరీతమైన చలిగాలిలో ఎందుకిలా వచ్చారు?"

'చీకటి కాకపోతే తన బ్రతుకులో ఇహ వెన్నెల ఎక్కడుంది? ఇతనెవరో పిచ్చివాడులా వున్నాడు. ఐనా ఏమిటీ ప్రశ్నల వర్షం?' గొణుక్కుంది ఆమె.

"మీరు చావడానికి వీల్లేదు!"

ఆమె తలెత్తి ఆశ్చర్యంగా చూసింది. "ఏం, ఎందుకని?" అంది మెల్లగా.

"నా అంతరాత్మ ప్రభోదించింది. దానికి విరుద్ధంగా ఏదీ జరుగనివ్వను!"

ఆమె విసుక్కుంది. "నా ప్రయత్నానికి మీరిలా అడ్డురావటం ఏమీ బాగాలేదు. దయచేసి నన్ను వెళ్ళనివ్వండి!"

"ఎక్కడికి, సముద్రంలో కలిసిపోవడానికా?"

"కాదు, వెనక్కి."

"ఇంత ఆవేశంతో చావాలని వచ్చిన స్త్రీ తిరిగి వెళ్ళిపోతుందంటే నమ్మశక్యమైన విషయంకాదు. జీవితంలో ఏదో పెద్ద దెబ్బతిన్నదానిలా కనిపిస్తున్నారు మీరు. మీ స్థితి చూసి నా మనసు జాలితో నిండిపోతున్నది. ఏదో తెలీని సానుభూతి కలుగుతూ ఉంది."

అతని మాటలు ఆమెకు దుఃఖం కలిగించాయి. మొహాన్ని చేతుల్లో కప్పుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ప్రకాష్ గుండె కలుక్కుమంది.

"ఏడవటం చాతకానివాళ్ళపని. కష్టాలనేవి ఎప్పుడో ఒకప్పుడు అందరికీ వస్తాయి. సుఖాలు వచ్చినప్పుడు పొంగిపోయి, కష్టాలు వచ్చినప్పుడు కృంగిపోవటమూనా?... ఆత్మహత్యకు పాల్పడటం వివేకవంతుల లక్షణం కాదు!" అన్నాడు.

"చావక బ్రతికి ఏంచేయమంటారు? ఎక్కడికి వెళ్ళమంటారు?" అంది కన్నీళ్లు చీర చెంగుతో తుడుచుకుంటూ.

"ఆవేశం ఆలోచనను నశింప చేస్తుంది. ఆవేశాన్ని వెనక్కినెట్టి, భవిష్యత్తులోకి చూసి ఆలోచించ గలిగితే కర్తవ్యం బోధపడుతుంది."

"ఆరునెలలనుంచి ఆలోచించి ఆలోచించి అలసి విసుగెత్తిపోయాను." అందామె వ్యధాపూరిత స్వరంతో.

మంచి చెడులతో సంబంధం లేకుండా కురుస్తూఉంది మంచు. చలిగాలి నరాల్ని 'జివ్వు' మనిపిస్తూంది.

"ఇప్పుడు ఏం చెప్పినా మీ బుర్ర కెక్కదు. ప్రస్తుతం విశ్రాంతి అవసరం ... పదండి, మీయింటి వరకూ నా కార్లో దిగబెడతాను." అన్నాడు ప్రకాష్.

"ఇంకా యిల్లేమిటి, బంధనాలు తెంపేసుకున్న అభాగినికి?" ఆమె కంటినుండి నీటి బిందువులు ముత్యాల్లా జలజలా రాలి పడుతున్నాయి.

ప్రకాష్ ఇబ్బంది పడ్డాడు. "పోనీ, మా యింటికి వెళదాం. నన్ను నమ్మగలరా?" అన్నాడు.

ఆమె బదులు చెప్పలేదు. మౌనం వహించింది. తలవంచుకున్న మనిషిని ఆమెను చలిబారినుంచి రక్షించలేక పోతోంది. నిలువెల్లా వణికిపోతూ ఉంది. ప్రకాష్ జాలి పడ్డాడు. తను తొడుక్కున్న కోటుతీసి ఆమెకు అందిస్తూ "ఇది వేసుకోండి. చలి ఎముకల్ని కొరికేస్తోంది" అన్నాడు.

ఆమె అందుకుంది. ఆ ఉలెన్ కోటు వేసుకున్నాక కాస్త వెచ్చదనం దొరికినట్లు 'ఫీ'లయింది.

"పదండి ఇక వెళదాం!" అంటూ దారితీశాడు ప్రకాష్. ఆమె అనుసరించింది. సంకోచం లేకుండా కార్లో కూచుంది. ప్రకాష్ యింటిముందు ఆగింది కారు. నౌకరు వచ్చి తలుపు తీశాడు. ప్రకాష్‌తోపాటు ఆమెకూడా యింట్లోకి అడుగుపెట్టింది. ఎదురుగా వున్న హాల్లో నాలుగుసోఫాలు, టీపాయ్ ఉన్నాయి. అక్కడ ఆమెను కూచోమని చెప్పి, లోపలికి వెళ్లాడు ప్రకాష్. కొంచెంసేపట్లో బ్రెడ్, బటరు వున్నప్లేటు ఒకటి నౌకరుచేత పట్టించుకు వచ్చాడు.

"థాంక్స్, ఇప్పుడేమీ తీసుకోలేను!" అంది.

"చిత్రా, మీ అభిమానం నాకు తెలుసు. మీరిది తినకపోతే నన్ను అవమానపరచినట్టుగా భావించుకుంటాను."

ఆమె తలెత్తి ఆశ్చర్యంగా చూసింది.

"నా పేరు మీకెలా తెలుసు!"

"చిత్రమైన పరిస్థితుల్లో కలిశారు మీరు. ఆపేరైతే మీకు బాగుంటుందని అలాపిలిచాను. మీ పేరుకూడా నిజంగా అదే కావటం అదృష్టం!" అంటూ లోపలికి వెళ్లి, 'టీ' తీసుకు వచ్చి యిచ్చాడు.

ఆమెకు అతనిపట్ల ఆప్యాయత కలుగుతూఉంది. టోస్టు తింటూ ఆలోచించసాగింది. 'తనంటే అతనికి ఎందుకంత జాలి? అతని ఆపేక్ష, సానుభూతి, అభిమానం చూస్తూవుంటే తన హృదయం ఆర్ద్రమౌతున్నది. ముక్కూ, మొహం ఎరుగని ఓ అభాగ్యురాలిపై ఎందుకీదయ? ... తనను ఏదేనా స్వార్థానికి ఉపయోగించుకోటానికా యీ ఎత్తు? ... ఛా, అతనలాంటి వాడుకాదు.' తన యీ ఊహకి సిగ్గుపడిందిఆమె. మళ్లీ అనుకుంది. 'అతనిలో నీచం ఉన్నదని అనుకోవటాని కూడా ఆస్కారంలేదు. చాలామంచివాడు. అతనిఇల్లాలు ఎంత అదృష్టవంతురాలు!' అని.

మెట్లదగ్గర కార్నర్‌లోవున్న ఫోన్ గణగణ మ్రోగుతున్నది. ప్రకాష్ వెళ్ళి రిసీవర్ అందుకున్నాడు. టీ తాగుతూ సంభాషణశ్రద్ధగా ఆలకిస్తూ ఉందిచిత్ర. ఆమాటల్లో అతనొక డాక్టర్ అనీ, పేరుప్రకాష్ అనీ తెలుసుకున్నదామె. ప్రస్తుతం ఎవరినో చూసేందుకు ఆసుపత్రికి వెళ్లబోతున్నాడని కూడా గమనించింది.

అతను పీఠలోకి వెళ్తూ "చూడండిచిత్రా! హాస్పిటల్లో ఓ కేసుకి చాలా సీరియస్‌గా ఉందిట! తొందరగా రమ్మన

మని పిలుపు వచ్చింది. అక్కడికే వెడుతున్నానిప్పుడు...నే వచ్చేసరికి బాగా పొద్దుపోవచ్చు; బహుశా తెల్లవారి పోతుందేమోకూడా. పైన రెండుగదుల్లో పక్క లమర్చిఉన్నాయి. మీాయిష్టం వచ్చినదాన్లో పడుకోండి. మీాఉనికికి ఏయిబ్బందీ కలుగదు ... నౌఖరు చూపిస్తాడు, వెళ్లండి!'' అని వెళ్ళి పోయాడు.

చిత్ర-అతను చెప్పిందంతా వినివూరుకుంది. ఏసమాధానమూ చెప్పలేదు. ప్రకాష్ కనిపించినంతవరకూ చూసి, నెమ్మదిగా సోఫాలోంచి లేచి ఆలోచిస్తూ మేడమీాదకి వెళ్లింది. నౌఖరు ఎదురువచ్చి ఆమెను ఓగదిలోకి తీసుకువెళ్లాడు. 'ఏమైనాకావాలా?' అని అడిగి, ఆమె అఖ్ఖరలేదన్న పిదప అక్కడినుంచి నిష్క్రమించాడు.

ఆ గది చాలా అందంగా ఉంది. ప్రకృతి దృశ్యాలతో సుందరంగా అలంకరించబడి ఉంది. గదికి మధ్యగా వున్న స్ప్రింగ్ కాట్ పై ఎక్కిపడుకుంది చిత్ర. తోరణంలా సాగుతున్న ఆలోచనలు అనంతమై మనసుకు విశ్రాంతిలేకుండా చేస్తున్నాయి.

తను అనేకమంది డాక్టర్లను ఎరుగును. అంతా ఏదో వ్యాపార సరళిలో మాట్లాడుతున్నట్టే ఉంటుంది. క్షణం కూడా తీరికలేనట్టుగా, గంభీరంగా మొహాలు పెట్టుకుని ఎదుటివాళ్ళను ఎప్పుడు వదిలించుకుందామా అన్నట్లుంటారు యీా డాక్టర్లు. కాని, వాళ్ళలో యింత విశాలహృదయం కల

ప్రకాష్‌లాంటి వ్యక్తి ఉండి వుంటాడని అసలు అనుకోలేదు తను. కనీసం ఊహించలేదు...అతనిభార్యను చూడాలని తాను అనుకుంటూ ఉంది. మరి ఆమె ఎక్కడా కనిపించ దేమిటి?...పుట్టింటికిగాని వెళ్ళిందేమో!' ఇలాఅనుకుంటూ అప్రయత్నంగా రేడియోవేపుచూసిందిచిత్ర. అక్కడ గిల్టు ఫ్రేములో కార్డుసైజులో ఉన్నఫొటోచూసి కలవరపడింది. చటుక్కున మంచందిగి రేడియోదగ్గరకు వెళ్ళింది. ఫొటో పరిశీలనగా చూసింది. ఆమె అనుమానం అక్షరాలా నిజ మయింది. మొహంలో ఆశ్చర్యం మొలకలెత్తింది.

ఈ ఫొటో చిట్టిబాబుది. అందులో సందేహంలేదు. ఇది ఇక్కడి కెలావచ్చింది? ఎలా వచ్చిందని? డాక్టర్ ప్రకాష్‌కీ చిట్టిబాబుకీ ఏమిటి సంబంధం?...ఒకవేళ స్నేహి తుడై ఉంటాడా?

చిట్టిబాబు ముఖ్యస్నేహితులంతా తనకు తెలుసు. ఐతే మరి డాక్టర్ ప్రకాష్‌తో తనకున్న స్నేహాన్నిగురించి తనతో ఎందుకు చెప్పలేదు? అలా చెప్పకపోవటంలోగల చిట్టిబాబు ఆంతర్యం ఏమిటి? ఇందులో ఏదేనా రహస్యం ఇమిడి ఉన్నదా?

అన్నీ ప్రశ్నలే ఉత్పన్నమౌతున్నాయి. కాని, సమాధానాలు లభించడం లేదు. జవాబులు కావాలంటే డాక్టర్ రావాలి. డాక్టరు రావాలంటే మరో ఐదారు గంటలు పడుతుంది. అంతదాకా వేచి ఉండటం తప్ప వేరే గత్యంతరం లేదు.

దీపం చుట్టూ పురుగులు చేరి కాంతిని హరిస్తున్నాయి.

దూరాన చర్చిలో రెండు గంటలు కొట్టారు.

కళ్లు మండుతూ ఉన్నాయి. ఆలోచిస్తూనే మంచం దగ్గరకు వచ్చి పక్కమీద వాలిగిపోయింది చిత్ర.



చీకట్లను చీల్చుకొని ఉషఃకాంతి తొంగిచూస్తూ ఉంది. సముద్రంమీదనుంచి చల్లటి పిల్లవాయువులు ఆహ్లాదకరంగా వీస్తూ - నిద్రాణమైన మద్రాసునగరానికి మేల్కొలుపులు పాడుతూన్నవి.

అప్పుడొచ్చాడు ప్రకాష్ ఇంటికి. ఒక్కడే కాదు. వెంట ఎవరో ఒక యువతి ఉంది. ఆమె చాలా అందంగా ఉంది. వయసు ఇరవైలోపు ఉండచ్చు. ఎవరో అంటే ఎవరోకాదు, ఆమె డాక్టర్‌కు బాగా దగ్గర. అంటే సోదరి; స్వయాన చెల్లెలు. ఉమెన్స్ కాలేజిలో బి. యస్. సి., చదువుకుంటూ ఉంది, తెలివైనది.

శేఖరు ఎదురొచ్చాడు వాళ్ళకి.

"రాత్రి వచ్చినామె ఏం చేస్తున్నారు?" అడిగాడు ప్రకాష్.

"పైన ఉన్నారు బాబూ! ఇప్పుడే కాఫీ చేసి యిచ్చాను. మిమ్మల్ని అడిగారు".

"సరే, నువ్వెళ్ళి స్నానానికి నీళ్లుతోడు!" అని చెల్లెలి వేపు తిరిగి "రమా, పైకి వెళ్ళి ఆమెతో మాట్లాడుతూ ఉండు. కాలకృత్యాలు తీర్చుకు వస్తాను" అంటూ స్నానాల గదికేసి నడిచాడు.

రమ చకచక మెట్లెక్కి తనగదిలోకి వెళ్ళింది. అక్కడ చిత్ర పడక కుర్చీలో కూచుని రాధాకృష్ణ పండితుని 'భారతీయ తత్వశాస్త్రము' చదువుకుంటూ ఉంది. రమరాక ఆమె గమనించలేదు. సన్నగా దగ్గింది రమ. పుస్తకంలోంచి తలెత్తి చూసింది చిత్ర. చూసి ఆశ్చర్యపోయింది. ఆమె ఆశ్చర్యంనుంచి తేరుకోకుండానే అడిగింది రమ.

"మీరు చదువుతున్నదేమిటి?"

ఆ పలకరింపు పరిచయం ఉన్నదానివలె ఉంది.

"మీరు..." అంటూ ఆగిపోయింది చిత్ర.

"నాపేరు రమ. డాక్టరు ప్రకాష్ మా అన్నయ్య" అంటూ అక్కడున్న కుర్చీలో కూచుంది.

"మీ వదిన కనిపించరేం, పుట్టింటికి వెళ్ళారా?"

అందుకు రమ సన్నగా నవ్వి "అన్నయ్యకింకా పెండ్లి కాలేదు" అన్నది.

"ఎందుకని? ఆయనకు యిష్టం లేకనా?"

"కాదు. అన్నయ్యకి కొన్ని ప్రిన్సిపల్స్ ఉన్నాయి. తన అభిప్రాయాలకు అనుగుణ్యంగా వుండే అమ్మాయి లభించేంతవరకూ చేసుకోట్ట!"

చక్కగా మాట్లాడుతుంది రమ. మధురమైన స్వరం. చిలుకలా పలుకుతుంది.

భాస్కరుని బంగారు కిరణాలు భూమి మీద పరుచుకుంటున్నాయి. లే ఎండ కిటికీ చువ్వల గుండా అద్దాలమీద పడుతూ, గదిలోకి చొచ్చుకు రావాలని విశ్వప్రయత్నం చేస్తూఉంది.

ప్రకాష్ నెక్టై సర్దుకుంటూ వచ్చాడు. వచ్చీ రాగానే "చిత్రా, మీకు రాత్రి సుఖంగా నిద్ర పట్టిందా?" అని అడిగాడు.

"ఆ!" అంటూ ఆమె లేచి నుంచుంది.

"చూడండి, నన్ను మీరిలా మన్నించటం నాకు బావుండదు. కూచోండి!" అంటూ రమ పక్కనున్న ఫ్రేము కుర్చీని వారి కెదురుగా లాక్కుని కూచున్నాడు.

చిత్ర కూచుంది మౌనంగా. రమ-తను రాత్రి తన క్లాసుమేట్ సావిత్రి యింటికి చదువుకుందుకు వెళ్ళటం, అక్కడ దీపాలు పోవటం, సావిత్రి కొవ్వొత్తి తెచ్చేందుకు లోపలకు వెళ్తూ చీకట్లో గోడను గుద్దేసిన ఉదంతం-యివన్నీ చెప్తూ, నవ్వలేక నవ్వుతోంది.

చిత్ర ఆమె మాటలు వింటూ ఉంది. ఎంతో ఆహ్లాదకరంగా ఉందామెకు యిక్కడ. నిష్కల్మషంగా, అమాయకంగా వుండే రమ పలుకులు పదేపదే వినాలనిపిస్తూ ఉంది. డాక్టర్ కి ఏదో తట్టింది. ఉన్నట్టుండి అన్నాడు.

"చిత్రా, మీకథ వినాలనివుంది మారమకూ, నాకూ. చెప్పేందుకు మీకేమైనా అభ్యంతరమా ?"

కళకళలాడుతూన్న ఆమె వదనమండలంలో విషాద చ్ఛాయలు అలుముకున్నాయి.

"ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా మీతో చెప్పక తప్పదు డాక్టర్ !" అంటూ చిత్ర ఓ క్షణం పాటు కన్నులు మూసుకుంది.

అన్నా చెల్లెళ్ళ చూపులు ఆమెపైనే కేంద్రీకరించబడి ఉన్నాయి. తరువాత కొంతసేపటికి మెల్లగా తనకథను ప్రారంభించినది చిత్ర.



కలిసిన కుటుంబంలో జన్మించాను. పుట్టినప్పుడు తల్లిని ఆ తర్వాత తండ్రిని మింగేసిన దురదృష్టవంతురాలను. నాకు ముందు అన్నయ్య ఉన్నాడు. నాకన్న రెండేళ్ళు పెద్ద. చనిపోయే ముందు మామయ్య పేర్న ఓ వీలునామా రాశారు నాన్న. తన ఆస్తి యావత్తూ అన్నయ్యకి, నాకూ సంక్ర మించేట్టూ, మేము పెరిగి పెద్దవాళ్ళ మయేంతవరకూ మామయ్య గార్డియన్‌గా ఉండేట్టూ అందులో రాసి ఉంది.

నాన్న పోయినప్పుడు అత్తయ్యా, మామయ్యా దగ్గరే ఉన్నారు. దహన సంస్కారాలవీ జరిపించాక రెండురోజులు

మాత్రమే అక్కడున్నాము. ఆ తర్వాత అన్నయ్యాను, నన్ను తీసుకుని మద్రాసు వచ్చేశారు. వాళ్ళకి అక్కడ వ్యాపారం ఉంది.

ఇదంతా నాకు ఊహ రాకమునుపు జరిగిన సంగతి. అత్తయ్యా, మామయ్యాలిద్దరూ చాలా మంచివాళ్ళు. అన్నయ్యాను, నన్ను ఎంతో ప్రేమతో సాకేవారు. వాళ్ళకీ ఓ అబ్బాయి ఉన్నాడు. అన్నయ్య యీడువాడు. పేరు రాజా. మామయ్య ఇంట్లో ఎక్కువగా ఉండేవారు కాదు. అత్తయ్య చెప్పింది ఓ సారి. వ్యాపారపు పనులమీద ఏవేవో వూళ్ళు తిరుగుతూ ఉంటారని. ఇంట్లో ఉన్నప్పుడయినా ఆయన దగ్గరకు పోవటమంటే మాకు భయం. అత్తయ్య దగ్గరున్న చనువు మాకు ఆయనవద్ద లేదు. రాజాకూడా మాతో పాటే. ముగ్గురం కలసికట్టుగా ఉండేవాళ్ళం. చదువుకున్నా, ఆడుకున్నా, పాడుకున్నా, కలిసే చేస్తుండేవాళ్ళము. మా అన్యోన్యతచూసి మా వీధిలో కొందరి పిల్లలకు అసూయ జనించిందంటే ఆశ్చర్యపడక్కర్లేదు.

మేము బయటిపిల్లలెవరితోను కలిసేవాళ్లం కాము. వాళ్ళంతా నడిచి స్కూలుకు పోతుంటే, మేము కారులో వెళ్ళేవాళ్ళం. స్కూలునుంచి ఇంటికి వచ్చేసరికి అత్తయ్య మాకోసం కాచుకుని ఉండేది. అన్నం అదీ తనే తినిపించి పడుకోబెట్టేది. మా సంరక్షణ చూసేందుకు నౌకర్లుకూడా ఉన్నారు.

పక్షపాతం లేకుండా ముగ్గుర్నీ ఒక్కలాగే పెంచింది అత్తయ్య. మా ఆస్థి వాళ్ళ దగ్గరున్నందుకు అలా పెంచ లేదు. సహజంగానే ఆమె స్వభావం మంచిది. కుట్రలు, కల్మషాలు తెలీవు. ఎవరైనా నేర్పుతామన్నా ఆమెకు పట్టు బడని విషయాలు అవి.

అత్తయ్య ఆశలన్నీ మా మీదనే. మేం పెరిగి పెద్ద వాళ్ళం కావాలని, విజ్ఞానమంతా మాలోనే మూర్తీభ వించాలనీ, మా అభివృద్ధిని కళ్ళారా చూడాలనీ కాంక్షిస్తూ ఉండేది. ఆమె ప్రేమానురాగాల్ని కొలిచేందుకు కొలత బద్దలు లేవు.

రోజులు, మాసాలు, సంవత్సరాలు ముందుకు జరు గుతూ ఉన్నాయి. యుక్తవయస్కుల మయ్యాం.

కాలం మనిషిలో మార్పును తీసుకు వస్తుంది. అందుకు పరిస్థితులు, పరిసరాలు కొంతవరకు దోహదం చేస్తాయి.

నేను స్కూల్ ఫైనలు చదువుతున్నప్పుడు అన్నయ్య గురించి కొత్తగా ఓ విషయం తెలుసుకోగలిగాను. ఎప్పుడూ ఒంటరిగా ఉండటానికి ప్రయత్నించేవాడు. ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు కనపడేవాడు. "అన్నయ్యా!" అంటూ పలకరిస్తే 'ఊఁ' అని, ఏమిటన్నట్టు చూసేవాడు.

అన్నయ్య నాకు దూరమైపోతున్నాడేమో అనే భావన కలిగింది. ఎంతో బాధ వేసింది. కనుగుడ్లనిండా నీరు కమ్మింది. నా రీడింగ్ రూమ్‌కి వెళ్ళి ఏడుస్తూ కూచున్నాను.

కొంతసేపటికి రాజా వచ్చాడు. నన్నూ, నా ఏడుపునీ చూసి అదిరిపోయాడు.

"ఏమిటి చిత్రా?" అన్నాడు.

అతని పలకరింపుతో మరింత ఉధృతంగా వస్తూ ఉంది దుఃఖం.

"అన్నయ్య మనకి కాకుండా పోతున్నాడు రాజా!"

"ఏం, ఇప్పుడేమైంది?"

"అన్నయ్య మాటల్లోని పరధ్యాన్నం, ఆ దీర్ఘాలోచనలు...నీవు గమనించ లేదా రాజా!"

"ఓస్, అంతమాత్రానికే ఏడుస్తారా ఎక్కడైనా? నే కనుక్కుంటాగా! అమ్మ పిలుస్తోంది. నవ్వే చిన్నారి ఏమిటో" అంటూ నా కన్నీళ్ళు తుడిచాడు,

అన్నయ్య, రాజా ఒకే క్లాసు. కాలేజీలు వేరు. తీసుకొన్న గ్రూపులు వేరు. రాజా అన్నయ్యను గట్టిగా చెబుతా డనుకొన్నాను. చెప్పాడో లేదో తెలీదుగాని, అన్నయ్యమాత్రం ఆ ధోరణిలోనే ఉండేవాడు. మొదట్లో పట్టానుబాధ. క్రమేపీ ఆ ప్రవర్తనను కళ్ళప్పగించి చూస్తూ పూరుకొనేదాన్ని. రాజాను నేను కనుక్కో లేదు. ఆ విషయంగురించి అతనిముందు ఎన్నడూ మళ్ళీ కదప లేదు నూడాను. ఆ తర్వాత నేనూ కాలేజీలో చేరాను.

ఒకేబాటను పయనించే మేము, మూడు బాటలుగా చీలిపోయాం. మాలో విజ్ఞానం పెరిగేకొద్దీ నాగరికతకుండా

అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ నాగరికత మా అంత ర్యాలముందు మంచుతెరలా నిలిచి. మమత, వాత్సల్యా లను వెనక్కి నెట్టింది.

ఇంట్లో అంతా కలిసేవుంటున్నా మాట్లాడుకునే వాళ్ళంకాము, పని ఉంటే తప్ప. అదైనా ఎంతో అనసరి మైతేను. నాకు స్నేహితులు ఉన్నారు. అన్నయ్య కెవరూ ఉన్నట్టులేరు. ఎక్కువగా చదువుకుంటూ ఉండేవాడు. ఎవరితోను మాట్లాడడు. ఎప్పుడూ నవ్వడు. చదువుతప్ప కింకో ధ్యాస లేదు. నా మనసులో ఏదైనా అనుభూతి, ఆలో చనలు చెలరేగినప్పుడు అన్నయ్యతో చెబుదామని గబగబ అతని గదిలోకి వెళ్ళేదాన్ని. ఆ గంభీర మూర్తిని చూడగానే నాలోని ఉత్సాహమంతా నీరుకారిపోయేది. ఏదో భయం వేసి మౌనంగా తిరిగి వచ్చేసేదాన్ని.

నాలుగు వసంతాలు గడిచాయి.

బి. ఏ. పూర్తిచేశాను. క్లాసు వచ్చింది.

ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలనైనందుకు నాస్నేహితు లంతా వచ్చి అభినందనలు తెలియజేశారు. అన్నయ్య ఉన్నతవిద్య అభ్యసించటంకోసం విదేశాలకు వెళ్ళాడు. రాజా ఆనర్సు పాసయ్యాడు.

ఒకనాటి సాయంకాలం అత్తయ్య పిలిచింది. ఏమిటో అనుకుని వెళ్లాను. అప్పుడు మామయ్యకూడా ఉన్నారు.

"అనసూ, దీనంత అందంగానూ ఉండేది వాళ్ళమ్మ. అచ్చు మా చెల్లెలి పోలికలన్నీ పుణికిపుచ్చుకుంది. మన రాజా ఎంత అదృష్టవంతుడు" అన్నాడు మామయ్య నన్ను చూస్తూ. అత్తయ్యపేరు అనసూయ. ముద్దుగా ఆయన 'అనసూ' అని పిలుస్తారు.

మావయ్య మాటల్లో ఏదో వ్యవహారం ఉందని తోస్తూంది.

"ఏమిటత్తయ్యా?" అన్నాను కంగారుగా.

"అదేనమ్మా, ఆపిలుపును శాశ్వతం చేస్తావని పిలిచాను"

"అంటే?"

"నీకు తెలీదని నేను అనుకోను. రాజాంబావకీ నీకు రేపు మాఘమాసంలో వివాహం చేద్దామనుకుంటున్నాం. అన్నయ్యకి యీవిషయం గురించి ఉత్తరం రాశారు చిన్నమావయ్య"

నమ్ముకున్న నేల, పాతాళంలోకి జారిపోతున్నట్లని పించింది.

"అత్తయ్యా!" అన్నాను "రాజాకూ నాకు పెళ్లా? పెంచిన నీచేతుల్తోనే తుంచేస్తావా నన్ను బ్రతుకల్ని?"

మామయ్య ఏదో అనబోతున్నాడు. ఇంక అక్కడ నిలవ బుద్ధికాలేదు. గబగబ రాజాంగదిలోకి వెళ్లాను. మంచం మీద పడుకుని ఏదో చదువుకుంటున్నాడు.

"రాజా...రాజా ఏమిటీఘోరం? ..మనిద్దరికీపెళ్లా? ఒక్క కంచంలో తిని, ఒక్క మంచంమీద పడుకుండి, ఒక యింట్లో ఒకచోటిలో పెరిగాం. రక్తసంబంధం ఉన్న అన్నా చెల్లెళ్లలా మసిలాం. అలాంటి మనయిద్దరికీవివాహబంధమా" అన్నాను ఆవేశంగా.

"ఇందులో తప్పేముంది చిత్రా! నిన్ను ప్రేమించాను. వివాహం చేసుకోవాలను కుంటున్నాను." అన్నాడు తాపీగా.

సమ్మెటతో తలమీద బాది నంతబాధ. ఆవేశం అసహాయతను ప్రదర్శించింది. ఫలితం కన్నీళ్లు!

"లేదు, రాజా అలా జరగడానికి వీల్లేదు!" అంటూ ఒక్క పరుగులో నా రీడింగ్ రూమ్ చేరుకున్నాను.

తలుపులు గడియపెట్టి మంచంమీద వాలిపోయాను. కన్నీటితో దిండు తడిసిపోతున్నది రాజానన్ను ప్రేమించాడుట! ఇదినాలో ఆశ్చర్యాన్ని దుఃఖాన్ని కలిగిస్తున్నది. ఎలా ప్రేమించ గలిగాడనేదే నాకు అనూహ్యంగా ఉంది. ఆలోచించగా ఆలోచించగా తట్టింది. పరస్పరం ప్రేమించుకున్నాం. ఇందులో అనుమానంలేదు. ఐతే దృక్పథాలు వేరు. అవి భిన్నమైనవి. అతన్ని నేను సోదరునిగా అతనునన్ను ప్రియురాలిగా, భార్యగా ప్రేమించాడు. మా భావములవల్ల పరస్పర ప్రకారాలు.

ఆవిధంగా రాజాని నేను ప్రేమించలేను; పెళ్ళిచేసుకో లేను. నా యీనిస్సహాయం ఇంటిల్లిపాదినీ బాధించవచ్చు; కలత

కొట్టవచ్చు. అందుకు నా బ్రతుకును బలిచెయ్యలేను. వాళ్ల చింత పోగొట్టటానికి నా ఆశయాలు, ఆదర్శాలు అంతంచేసుకోలేను.

ఈసంఘటన జరిగినతర్వాత అత్తయ్య నాతో మాట్లాడటంమానేసింది. రాజు అసలు కనిపించటమేలేదు. రాత్రిళ్లు బాగా పొద్దుపోయాక వచ్చేవాడు. ఎవరిమొహంలోనూ కళా కాంతులు లేవు. దుర్భరవిషాదం మాయింటిని ఆవరించుకుంది. అన్నయ్యకు పరిస్థితుల్ని విశదపరుస్తూ అమెరికా ఉత్తరం రాశాను. ఇంట్లో నాగౌరవ మర్యాదలకు ఏమీలోటురావటం లేదు. అన్నీ మామూలుగానే జరిగిపోతున్నాయి. మామధ్య మాటలైతే లేవుకాని, హృదయాల్లో పదిలపరచుకున్న ప్రేమాభిమానాలు ఎక్కడికి పోతాయి?

యూనివర్శిటీలో ఎం. ఏ. లో చేరాను. రోజూ కాలేజీకి వెడుతున్నాను; వస్తున్నాను. ఉత్సాహంఅనేది నానుంచి తొలగిపోయింది. మనశ్శాంతి నాకు దూరమయింది. ఈజీవితానికి అర్థం ఏమైనాఉందా?-అనిపించింది. నిస్తబ్దత పెనవేసుకున్నప్పుడు మనిషిమానసికంగా పెరగటం ఆగి పోతాడు. అలాగే గడిస్తున్నాయి రోజులు.

ఆ ఉదయం అత్తయ్యను చూద్దామని వెళ్ళాను. చిక్కి శల్యమైపోయింది. బహుశా బెంగపెట్టుకొందనుకుం టాను. "అత్తయ్యా!" అన్నాను. నన్ను చూడగానే ఆమె హృదయంలోని ప్రేమ పెల్లుబికింది. కన్నీరు స్రవంతిలా ప్రవహిస్తూ ఉంది. నా నిర్ణయం అత్తయ్యపై అంత ప్రభా

వము చూపిస్తుందనుకోలేదు. ఆమె బాధ నా గుండెల్ని కోస్తూంది. ఎదురుగా ఉండి అదంతా చూస్తూ భరించలేను. నానిర్ణయాన్ని మార్చుకోగలనా?–లేదు? నాకా శక్తి లేదు.

"నన్ను క్షమించు అత్తయ్యా!" అంటూ వలవలా ఏడుస్తూ నా గదికి వచ్చాను.

అత్తయ్య రాజాల మంచితనం నన్ను కృంగదీసేస్తూంది. నేను ఈ యింట్లోంచి బయటకు పోతేగాని వాళ్ళకు సౌఖ్యం లభించదు. ఆ విషయం నాకు తెలుసు. అందుకే వెళ్ళిపోవటానికి నిశ్చయించుకున్నాను. బెంగుళూరు సరోజ దగ్గరికి. అది నాకు ప్రాణస్నేహితురాలు.

బట్టలు సూటుకేసులో సర్ది, మూలనున్న బెడ్డింగు పైకి తీశాను. నౌఖర్ని పిలిచి టాక్సీ తీసుకురమ్మన్నాను. నా ప్రయాణం సంగతి అత్తయ్యకి తెలియనివ్వలేదు.

"అమ్మా!" అన్నాడు నౌఖరు, నేను టాక్సీలో కూచున్నప్పుడు. అర్థమైంది వాడిబాధ.

"పనిమీద ఊరికి వెడుతున్నాను. రెండు రోజుల్లో వస్తాను. ఈ ఉత్తరం అత్తయ్యకియ్యి!" అని ఓ కవరు వాడిచేతి కిచ్చాను.

బెంగుళూరు వెళ్ళాను. సరోజ నన్ను ఎంతో ఆప్యాయతతో ఆహ్వానించింది. ఆరు మాసాలు ఉన్నాను అక్కడ. అయినా నాకు ప్రశాంతత ఏర్పడలేదు. ఇంక ఉండబుద్ధి కాలేదు. తిరిగి మద్రాసు వచ్చాను, సెంట్రలులో బండి దిగాక

అనిపించింది. ఇంటికి వెళ్తే పరిస్థితిలో మార్పేమీ ఉండదు. మళ్ళీ మామూలే! ... మనసంతా చికాకై పోయింది. ఊళ్ళోకి వచ్చి హోటల్‌లో ఓగది తీసుకున్నాను. నన్ను ఆలోచనలు వెంటాడటం మానలేదు. విషాదం నా హృదయం నిండుకుంటూ ఉంది. బ్రతకాలనే వాంఛ పోయింది. ఆత్మహత్య చేసుకుంటే అందరి బాధలూ వదలిపోతాయనిపించింది. అంతే! నిశరాత్రివేళ సముద్రునికి అర్పితం కావాలని బయలుదేరాను. కాని...కాని, మీరు చావనివ్వలేదు డాక్టర్!"



అంటూ ముగించినది చిత్ర. ఆమె నయనాలు అశ్రుపూరితాలైనవి. మొహాన్ని చేతుల్లో దాచుకుంది. డాక్టర్ మౌనం వహించాడు. రమ శూన్యంలోకి చూస్తూ ఉంది. ఆ గదినిండా గంభీరం అలుముకుంది. నిశ్శబ్దాన్ని చీలుస్తూ అన్నాడు డాక్టర్ ప్రకాష్.

"చూడండి, చిత్రా! జీవితం సుఖదుఃఖాల సమన్వయం. అవి రెండూ అనుభవించకుండా మానవుడు తనువు చాలించలేడు. నిజానికి మీకు తగిలిన షాక్ చాలా చిన్నది. అంటే ఆత్మహత్య చేసుకోవలసినంతటిది కాదు. హృదయాలను అతిసున్నితంగా ఉంచుకోవటంవల్ల వచ్చిన

చిక్క యిని మీకు కావలసింది ఈ లోకంలో తప్పక దొరుకు
తుంది. ఇదే మీ ఇల్లుగా భావించుకుని యిక్కడే వుండి ఆస్వా
దించండి. మీకు మనశ్శాంతి కలిగించటానికే నేనూ, మా
రమా ప్రయత్నిస్తాం. మనం కోరుకున్న వస్తువును బ్రతికి
సాధించాలిగాని, చచ్చిపోయి చేసేదేమిటి?''

చిత్ర సమాధానం చెప్పలేదు. అతని మాటల్లోని అర్థం ఆకళింపుచేసుకుంటూ ఉంది.

ప్రకాష్ చేతినున్న వాచీకేసి చూసి "గుడ్ గాడ్, అప్పుడే టైము పదయింది. మీకు తోడుగా రమ ఉంటుంది. ఇంక హాస్పిటల్‌కు వెడతాను. మళ్ళీ సాయంత్రం కలుద్దాం. ఆఁ, రమా! ఆమె ఇక్కడ వుండేందుకు తగిన ఏర్పాట్లు చేయించు'' అన్నాడు.

"అలాగే అన్నయ్యా!''

డాక్టరు వెళ్ళిపోయాడు. హోటల్ క్వీన్స్‌నుంచి చిత్ర సామానులన్నీ తెప్పించింది రమ. ఆ అన్నా చెల్లెళ్ళ అనురాగం, అన్యోన్యత చిత్రను ఆకట్టుకుంటూ ఉన్నాయి. నిజమైన మనుషులంటే వీళ్ళే. సహృదయత, సౌజన్యం మూర్తీభవించిన వ్యక్తులు. ఇలాంటివాళ్ళమధ్య మసలటం ఎంతో హాయి అనిపిస్తూ ఉంది.

ఆ రాత్రి భోజనాలవీ అయ్యాక మళ్ళీ రమగదిలో ముగ్గురూ సమావేశమయ్యారు. ప్రకాష్ అవీ, యివీ చెబుతూ తను నవ్వుతూ, వాళ్ళను నవ్విస్తున్నాడు.

చిత్ర ఉన్నట్టుండి ఏదో జ్ఞాపకం వచ్చినదానివలె "డాక్టర్, ఈ ఫోటో ఎవరిది?" అంది టేడియోంవేపు చూపిస్తూ.

"ఈ వ్యక్తిగురించి నాకన్న మా రమకు ఎక్కువ తెలుసు. చెప్పు రమా ఎవరో!" అన్నాడు చెల్లెలివేపు చూపులు బరపుతూ ప్రకాష్.

రమ బుగ్గలు సిగ్గుతో గులాబీవర్ణం దాల్చాయి. అధరాలు కెంపులయినాయి,

"ఉహుఁ, నీవే చెప్పు అన్నయ్యా!" అంది తల దించుకొని.

డాక్టర్ ప్రకాష్ సన్నగా నవ్వుతూ "రమ ఆరాధించే వ్యక్తి. ఆమె జీవితానికి కాబోయే భాగస్వామి. పేరు చిట్టిబాబు" అని, మళ్ళీ అంతలోనే మొహాన్ని గంభీరంగా మార్చుకుని "ఆమె తన పార్టనర్ని ఎన్నుకోవటంలో పొరపాటు చెయ్యలేదనుకుంటాను. చెయ్యదు కూడాను. అదే నా నమ్మకం" అన్నాడు.

చిత్ర కళ్ళతోనే అభినందనలు అందజేసింది రమకు. "ఈనెల ఇరవై ఐదున ప్రధానం" అన్నాడు తిరిగి డాక్టర్.

రోజులు గడుస్తున్నాయి. రమ వివాహముహూర్తం దగ్గరపడుతూంది. ఒకరోజు చిత్ర బజారుకు వెడితే అక్కడ ఆమె ప్రియస్నేహిత సరోజ కనిపించింది. చాలాకాలం తర్వాత కలయిక. ఎంతో సంతోషం అనుభవించింది చిత్ర.

సరోజను విడిచి ఇంటికి వచ్చేసరికి ఏడుగంటలు దాటింది. ప్రకాష్ ఒక్కడే హాల్లో కూచుని ఉన్నాడు. "మీరాజా వచ్చాడు!" అన్నాడు చిత్రను చూడగానే.

ఆమె అదరలేదు, బెదరలేదు, కదలలేదు. "నాకు తెలుసు డాక్టర్, వస్తాడని! కాని ఇప్పుడు మీతో ఓ విషయం చెప్పాలని వచ్చాను" అంది.

"ఏమిటి?"

"నాకు కావలసిన వస్తువు వెతుక్కున్నాను. ఐతే అది నాకు లభ్యమౌతుందనే నమ్మకంలేదు. అది నేను సాధించలేను" అన్నది. ఆ స్వరంలో ఎంతో నిరాశ ధ్వనిస్తూ ఉంది.

"నీవల్ల కాకపోతే నేను లేనా చిత్రా! నీ జీవితం సౌఖ్యప్రదం కావాలనే నా నిరంతర తాపత్రయం. అందు గురించి ఏం చెయ్యటానికైనా సిద్ధంగా ఉన్నాను. వివరంగా చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది చెప్పు!" అన్నాడు ప్రకాష్ అనునయంగా.

"నే నొకర్ని ప్రేమించాను. ఆయనే నా జీవితానికి వెలుగు" అంది తలదించుకొని.

"ఎవరా భాగ్యశాలి?"

"మీరే ఐతే?"

తన హృదయవీణను ఎవరో శ్రుతి, లయబద్ధంగా మ్రోగించినట్లయింది ప్రకాష్‌కి. "నేనా?" ఆనందాశ్చర్యాలతో అన్నాడు. "నాకింత అదృష్టం పడుతుందనుకో లేదు."

ఆమె పువ్వులా అతని పాదాలపై వాలిపోయింది. "మీదికాదు, నాకే అదృష్టం. మీరు నాకు దేవుడిచ్చిన వరం. యీ వరం కోసమే నా అన్వేషణ. నాకోర్కె ఫలింపజేసిన మీకు కృతజ్ఞత ఎలా చెప్పుకోవాలో తెలీటంలేదు డాక్టర్!" అంది చిత్ర.

రెండు వెచ్చటి కన్నీటిబొట్లు అతని పాదాల్ని తడిపాయి. ఆమెను పైకిలేవనెత్తుతూ "నా అదృష్టంకూడా!" అన్నాడు-కన్నీళ్ళను చూపుడువ్రేలితో తుడుస్తూ.

మేడదిగి రాజా వచ్చాడు. అతని వెనకనే రమ వస్తూ ఉంది. అతన్ని చూసి స్తబ్ధురాలైంది చిత్ర. ఏలా పలుకరించాలో అర్థంకాలేదు. స్నేహవాత్సల్యాలు ఆమెను నిలువనీయటంలేదు.

"రాజా!" అంది.

"చిత్రా!" అన్నాడు రాజా. "నాగురించి ఇల్లు విడిచిపోయావని తెలిసి చాలా చింతిస్తున్నాను. మొదట్లో నీపట్ల ఆశలు పెంచుకున్నాను. నీ అభిప్రాయం తెలీక ఎంత పొరపాటుచేశానో అర్థమైంది చెల్లీ! ఆలోచించగా తేలిందేమంటే-నాకు రక్తబాంధవివి కాకపోయినా నీవు సోదరివని. ఆనాడు పొరపడ్డానుకాని, అనాలోచితంగా అనేశానే అని లోలోపలే కుమిలిపోయేవాడిని. ఆవేదనతో అలమటించాను. సిగ్గుతో నా మొహం నీకు చూపించలేకపోయాను. నీవు ఫ్రాన్సుకి వెళ్ళినట్టు అమ్మకు రాసిన ఉత్త

రంలో చూశాను. అప్పుడు మరింతగా 'క్షీ' లయ్యాను. మనస్తాపం పోగొట్టుకుందుకు కన్నెమరా లైబ్రరీకి వెళ్ళేవాణ్ణి రోజూ అక్కడే రమతో నాకు పరిచయమైంది. ఆపరిచయం ప్రేమగా మారింది.

మధ్యాహ్నం ఇక్కడికి వచ్చినప్పుడు సంగతంతా తెలిసింది. ఇక్కడైనా సుఖంగా ఉంటూ ఉన్నందుకు చాలా సంతోషించాను. నీవు ఎక్కడున్నా నీసుఖ, సౌఖ్యాలే నాకు కావలసింది చెల్లీ! ఇప్పుడు నీ మనసు ఏమిటో స్పష్టంగా బోధపడింది. ప్రకాష్ బావ అదృష్టవంతుడు" అన్నాడు రాజా.

ఆ విద్యార్థినులమధ్య వారి మంచిమనసులమధ్య ఇన్నాళ్లుగా వున్న మంచుతెర విడిపోయింది. కృత్రిమభావాలు సంస్కారం వారిని చేరలేవు.

"అన్నయ్యా!" నిన్నూ, అన్నయ్యనూ కష్టపెట్టినందుకు క్షమించు!"

"మనలో మనకి యివన్నీ ఎందుకమ్మా. పరుల ఎదురుగా యిలా చేస్తే నవ్వరూ!" అన్నాడు రాజా, రమను చూపిస్తూ.

"అహా, ఏం గొప్పకబుర్లండీ అబ్బాయిగారికి. ఇక్కడికి నేను అల్లరిదాన్నయినట్టు" అంది రమ రాజాను వెక్కిరిస్తూ.

"రమా, చిట్టిబాబును ఇంట్లో అంతా ముద్దుగా 'రాజా' అని పిలుస్తాం. అతనే ఇతనని కోపగించుకోవు కదూ!"

"వదినా, నీ మనసు నాకు తెలీదా! పాలలా స్వచ్ఛమైనది" అంది రమ మెరుస్తున్న కళ్ళతో చిత్రనుచూస్తూ.

డాక్టర్ ప్రకాష్ తృప్తిగా నవ్వుకున్నాడు.

మబ్బుల్లో దాగిన చంద్రుడు మెల్లగా బయటకు వచ్చాడు.

---

## 2. ఏటి ఒడగ

"ఖైమ మే హై బుల్‌బుల్
సైయాద ముస్కురాదె"

రేడియోలోంచి లతామంగేష్కర్ కంఠం సుమధురంగా సన్నగా వినిపిస్తోంది. ఈజీఛైర్లో పడుకొని మాలిని ఏదో ఆలోచిస్తున్నది. ఆమె పాట వినటంలేదు.

గోడగడియారం ఠంగు ఠంగుమని పదిగంటలు కొట్టింది. ఉలిక్కిపడి కళ్లు విప్పింది మాలిని. ప్రక్కకెళ్ళి రేడియో ఆఫ్ చేసింది. వడివడిగా మేడదిగి కిందకి వొచ్చింది.

గోడకి జేర్లబడి కునికిపాట్లు పడుతున్నది వంటమనిషి మంగమ్మ. ఆమె వరస చూసి చిరాకెత్తుకొచ్చింది మాలినికి.

"మంగమ్మగారూ!" అని పిలిచింది కాస్త గట్టిగా.

"ఏమిటమ్మా!" అంటూ ఆవిడ లేచి నుంచుంది.

"అయ్యగారు వచ్చారా?"

"ఆఁ, వచ్చి స్నానంచేసి భోజనం ముగించుకొని ఇప్పుడే వెళ్లారు."

"మరి నన్నెందుకు పిలువలేదు?" అంది తీవ్రంగా మాలిని.

"మిమ్మల్ని పిలుద్దామని పైకి వస్తోంటే అయ్యగారే వస్తున్నారు."

ఉక్రోషం ముంచుకొచ్చింది మాలినికి. "చాలా గొప్పపని చేశారు" అంటూ అక్కణ్ణించి కదిలి సెల్లో ఉన్న ఔట్ హౌస్ కేసి నడవసాగింది. దారిలో వారు పెంచుకుంటున్న 'లిల్లీ' తోకాడించుకుంటూ వచ్చి ఆమె కాలు నాకసాగింది.

"లిల్లీ! నీకున్న విశ్వాసంలో నాలుగో వంతైనా లేదు మీ యజమానికి!" అంది దాన్ని చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంటూ.

మాలిని-ఆనంద్‌లకు వివాహంజరిగి రెండేళ్ళయింది. ఆనంద్ డాక్టరు. ఎప్పుడూ ఏదో రీసెర్చి చేస్తూ ఉంటాడు. ఈ రెండేళ్ళ వైవాహిక జీవితంలో ఎన్నడూ ఆనందం అనుభవించి ఎరుగదు మాలిని. డాక్టర్ ఆనంద్‌కి తీరిక చాలా తక్కువ. పేషెంట్స్‌ని చూడ్డంతోనో, రీసెర్చి చేయటంలోనో అతనికి టైము సరిపోతూ ఉంటుంది. భార్యను ఏనాడూ షికారుకుగాని, పిక్నిక్, పార్కు, సినిమాలకిగాని తీసుక వెళ్ళ లేదు.

"ఏమండీ ఇదేమైనా మీకు బావుందా?" అంటే—

"ఏం చెయ్యమంటావు మాలినీ! నువ్వు చూస్తున్నదేగా! నాకు తీరిక ఏదీ? అంటాడు.

ఇవాళ షాపింగ్‌కి వెళదామని చెబుదామనుకున్నది. తనతో మాట్లాడకుండా, తను లేకుండా భోజనం చేసి వెళ్ళి పోవటం తనకు చాలా చిన్నతనంగా అనిపించింది మాలినికి.

ఆనంద్ ఉన్నగది దగ్గరికి వచ్చింది. లోపలికి చూసింది. మందులు కంపోజ్ చేస్తున్నాడు ఆనంద్. గదిలో అడుగు పెట్టింది.

"ఏమండీ!"

"ఓ, మాలిని, రా! ఇలా కూర్చో!"

"కూర్చోడానికి రాలేదు! ఒక విషయం అడగటానికి వచ్చాను."

అబ్బో చాలా తీవ్రంగా ఉన్నావే, ఏమిటి సంగతి?"

చూడు మాలినీ! ప్రస్తుతం ప్రపంచంలో ఇంత వరకూ ఎవరూ కనిపెట్టని కొత్తమందొకటి కనిపెడుతున్నాను. అది సక్సెస్ అయిందంటే మన పేరు ప్రఖ్యాతులు దేశమంతటా మార్మోగుతాయి. నీ భర్తకి పేరు ప్రతిష్టలు రావటం నీకు గొప్ప కాదా?"

"ఎంతసేపూ పేరు ప్రతిష్టలేగాని, భార్య సుఖం సంగతి మీకవసరం లేదా?" అంది రోషంతో.

"మాలినీ, సంసార చక్రం ఎంత చక్కగా తిప్పుతున్నావ్. భర్తృహృదయానుగుణంగా నడుచుకునే భార్య ఎన్ని జన్మాల పుణ్యాన వల్ల లభిస్తుందో" అంటూ చెయ్యి అందుకున్నాడు ఆనంద్.

"ఎట్లాగైనా మగాళ్ళ మాటలు నేర్చినవాళ్ళు" లేచి అతని భుజాలపై చేతులు వేసి, మొహంలో మొహం పెట్టి జాలిగా చూస్తూ అడిగింది.

"ఏమండీ, మిగిలింది లేపు చేసుకోకూడదూ?"

"ఏం?"

"అబ్బ! మీ రిక్కడ మనుషులు కంపోజ్ చేసుకోం టుంటే ఒక్కదాన్నీ గదిలో కూచోవాలి. ఏం తోచదు! నన్ను ఒంటరితనం ఎంతగా బాధిస్తోందో మీ కేం తెలు స్తుంది?"

"ఏం చెయ్యను? నీవు చూస్తూన్నదేగా!...అంత జాలిగా యింట్లో కూర్చోక పోతే ఏదైనా ఉద్యోగానికి దర ఖాస్తు పెట్టకూడదూ?"

"నా బ్రతుకి ఇంక నొక్కటే తక్కువైంది!"

"మాలినీ ఒక్కసారి అట్లా బైటికి వెళ్ళి దేశాన్ని చూడు! నీవలె చదువుకున్న స్త్రీలు ఎంతమంది వున్నారు? వాళ్ళకు నీకు తేడా ఏమిటో ఎప్పుడైనా ఆలోచించావా?"

"చాల్లెండి - మీ సిద్ధాంతాలు నాకు చెప్పకండి" అంటూ మందులు కలిపేసింది మాలిని. ఆనంద్ కి కోపం వొచ్చింది.

"మాలినీ!" బిగ్గరగా అరిచాడు. "బుద్ధి లేకపోతే సరి! పళ్ళురాగానే సరా!" అతని మాటలు మాలినికి ఉద్రేక మోత్తనం కలిగించాయి. కళ్ళను నీళ్లు జలజల రాలాయి.

“అప్రస్తుతం కీ, నేను ఏది చేసినా తప్పే! మీరు వచ్చేట్టు కష్టపడుతూనే ఉన్నారు, చూడలేక, ఆరోగ్యం పాడై పోతుంది గదా అని విశ్రాంతి తీసుకోమన్నాను. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి. మధ్య నా కెందుకు?” అంటూ విసురుగా ఆక్రోశించి పక్క గదిలోకి వెళ్ళిపోయింది,

ఆనందుకి మొదట్లో అంత కోపం వొచ్చినా, అది అప్పటికప్పుడే చల్లారిపోయింది. కాని మాలినికి కోపం మాత్రం అల్లాగే పెరుగుతోంది. భార్యను ఆగ్రహం ఆవేశించిందని ఆనందు తెలుసుకొన్నాడు. వెంటనే ఆమెను నవ్వించి, నవ్వించాలనుకున్నాడు.

ఇంటి యజమాని-ఇల్లాలు రుసరుస లాడుకుంటే ఆ కొంప నరకంతో సమానంగావుంటుంది. ఆ వేళ వారి యింట్లో నవ్వులుండవు. ఇల్లు చీకటిమయంగా కనిపిస్తుంది. ఎవరైనా మధ్యవర్తిత్వానికి పోయారంటే-ఆవొచ్చిన పెద్దమనిషికి నెత్తిమీద వెంట్రుకలుండవు.



“మాలినీ, నామాటకు కోపం వొచ్చిందా?” అన్నాడు ఆనంద్ దిండులో మొహందాచి ఏడుస్తున్న ఆమెను పైకి లేవదీస్తూ. ఆమె లేవకుండా మరింత బిర్రుక్క-మంచాన్ని గట్టిగా కావలించుకొంటూ ఉన్నది,

"కోపం లేదు, గీపం లేదు. మీ పని మీరు చూసుకోండి."

"లేదంటూనే యీ విసుర్లెందుకు మాలినీ!"

"నన్నెందుకు బాధపెడతారు? మీరు చేసేది మీకేం తెలిసింది. నాకు తెలివి తేటల్లేవు. ఇంకా అజ్ఞానంలోనే వున్నా" బెడాయించుకొని పడుకొన్న మాలినిని బలవంతంగా కూర్చో బెట్టి, ఆమె సరసన కూచుని "యీ మాత్రానికే నీకింత ఆగ్రహం కలిగితే ఎట్లా చెప్పు? పరస్పరానురాగంతోనే కదా అనుకూల దాంపత్యం? నీకు తెలుసుగా హృదయం కలదానివి" అన్నాడు ఆనంద్.

"ఇప్పుడు కఠినంగా ప్రవర్తించింది మీరా? నేనా?"

"నేనేనని ఒప్పుకుంటున్నాను. ఇప్పుడైనా నీ కోపం చల్లారిందా?" అంటూ ఆమె బుగ్గను చిదిమాడు.

"నాకు కోపం ఎందుకూ?" చిన్నగా నవ్వుతూ అన్నది.

"మాలినీ! నిజంగా ఆడవాళ్ళు ఎంత చదువుకొన్నా, వారి సహజత్వం పోదుసుమా! మాట్లాడితే మూతి ఓరగా యించడం, భర్తవొచ్చి నాదే తప్పు అని ఒప్పుకునే దాకా వరకూ మూర్ఖత్వం పట్టి కూర్చుంటారు."

"మిమ్మల్ని అనడానికి నాకు ఆమాత్రం స్వాతంత్ర్యం లేదా?"

"స్వాతంత్ర్యం లేకపోవడమేమిటి? ఆడదాన్ని అసలు అందుకనే పుట్టించాడుట భగవంతుడు!" అంటూ ఆమెను అక్కున చేర్చుకొన్నాడు ఆనంద్. మారుమాట్లాడకుండా అతని బాహువుల్లో బందీఅయిపోయింది మాలిని.



సాయంత్రం ఆరున్నర గంటలయింది.

"మాలినీ! ఏమిటాలోచిస్తున్నావ్?"

"వేరే ఏముందీ-మీ గురించే!"

మూడ్రోంతులను పైగా పనిపూర్తయింది. నీవు పైకి వెళ్ళు. అరగంటలో తప్పకుండా వొస్తా!"

"వొస్తారు కదూ?"

"ఓ—యస్."

మాలిని తిన్నగా మేడమీదకు వెళ్ళడానికి బదులుగా మేడ ముందుగల తోటలోకి వెళ్ళింది. నాలుగు గోడలమధ్య బంధింపబడ్డ ఖైదీ జీవితం కాస్త తప్పినట్లయింది.

అవి పౌర్ణమిరోజులు కావటంవల్ల చంద్రుడు అప్పుడే ఉదయిస్తూ వెన్నెలను లోకం పైకి వెదజల్లుతున్నాడు. ఆ వెన్నెల వెలుగులో ఉద్యానవనమంతా ఎంతో చక్కగా శోభిస్తోంది. గులాబీమాటున నిలబడివున్న మాలిని వొంటికి చల్లని ప్రత్యూషపవనాలు వొచ్చి తాకుతూన్నవి. చిక్కటి వెన్నెల, చల్లనిగాలి, తనివితీరని ప్రకృతిసౌందర్యం ఆమెను మోహ పులకాంకితం చేస్తూన్నవి.

అంతలో ఒక కంఠం చల్లగా వీచే ప్రత్యూష పవనంతోపాటు, హృదయపు పాల సముద్రాన్ని పొంగించే అమర్త్య సంగీతం ఆమెచెవుల కింపుగా సోకింది. మోహరంజితయై, పులకాంకితయై చెవులు నిక్కించింది మాలిని. తీయని రాగాలపై తేలిపోయింది ఆమె మనసు.

అది నిజంగా రాజా కంఠధ్వనే. ఎంత అద్భుతంగా పాడుతున్నాడు. గానంలో తనకున్న కళా నైపుణ్యాంతో, కళా ప్రపంచాన్ని ముగ్ధపరిచేలా ఎంత చక్కగా ఆలాపన చేస్తున్నాడు!

ఆమె రెండు నిముషాలు అట్లాగే ఆగి విన్నది. అటువంటి సంగీతం చాలాసార్లు వింది కానీ, ఎన్నడూ కొంతసేపు ఆగ, ఆ సంగీతామృత పానం చేయలేదు. తమకు అదృష్టవశాత్తు రాజా మేడప్రక్కనే-మేడదొరకడం ; కఠినశిలలనైనా కరిగించగల అతని సంగీతం వినే భాగ్యం కలగడం సంభవించినది.

కొంతదూరం నడిచి మలుపు తిరిగింది. అంతకంతకు సంగీతం దగ్గరౌతోంది. హృదయాన్ని సూదంటురాయిలా ఆ వైపుకు ఆకర్షిస్తోంది. కానీ, అతనికి కనిపించకుండా వినాలని ప్రక్కనే వున్న మరో గులాబీమాటున దాక్కొని, నిక్కి నిక్కి చూస్తోంది.

పాట ఆగిపోయింది.

మరో పాట పాడుతాడేమోనని అక్కడే వేచివున్న ఆమెకు 'మాలినీ!' అన్నమాటలు అస్పష్టంగా వినిపించినవి. ఆమె వెనక్కి తిరిగింది. రాజా దీనంగా చూస్తూ తనవేపే వొస్తున్నాడు. అతని చూపుల్లోని అర్థంకాని భావాలు ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసినవి.

"ఆనంద్ ఉన్నాడా?"

మాలిని ఏమీ మాట్లాడలేకపోయింది. ఇట్లా జరుగుతుందని ఆమె ఏమాత్రం ఊహించలేదు. నిజానికి అతను ఆమెకి బాగా పరిచితుడు. అంతేకాదు-ఒకప్పుడు అతను మాలినిని ఆరాధించేవాళ్ళలో ఒకడుకూడాను. రాజా అట్లాగే చూస్తూ "మాటకు బదులు చెప్పవేం మాలినీ!" అన్నాడు.

"ఉన్నారు." అతని చూపులు ఆమెను సిగ్గుతో ముంచెత్తినవి.

రాజా ఒక చిరునవ్వు విసిరి బయల్దేరబోయాడు. రోజూ తను గడుపుతున్న నిరాశాజీవితం తలచుకొనేసరికి ఆమెకే అసహ్యమేసింది. కాస్త స్వేచ్ఛ అనుభవించాలనే ఆశక్తి కలిగింది ఆమెకి.

"నువ్వు అద్భుతంగా పాడతావు రాజా! నీ ముందు ఎంతటి సంగీత ప్రవీణులైనా తలొగ్గవలసిందే!"

"నాపట్ల నీకు వున్న అభిమానానికి కృతజ్ఞుణ్ని."

"రాజా! నాకు పాడడమంటే చాలా సరదా. ఇంత కాలం ఎందుకో వృథాగా పాడుచేశానే కాని, మొలకునుంచో సంగీత సాధన చేసివుంటే ఇప్పుడీ ఒంటరిపాటులోని బాధను కాపుకోనేదాన్ని!" మాలిని అతనివైపు నిరాశగా చూస్తూ అన్నది.

"బ్రతుకునైన అప్పుడే విసుగుదలైతే ముందెట్లా? ఆవగింజలో అరభాగంకూడా గడవలేదు. అప్పుడే కొమ్మ కొసన వున్నట్లు మాట్లాడుతున్నావేమిటి?"

"ఏం చెయ్యాను, పడుచుదనంలోనే ముసలిభావాలు. అట్లా షికారు పోదాం రమ్మంటే ఏదో అమ్మమ్మ మాటలు ప్రారంభిస్తారు."

"ఇప్పుడే యిట్లా వుంటే, ఇకముందు పిల్లలు పుడితే?"

"ఏముందీ; యిల్లొక మఠం—వారొక సన్యాసి—నేనొక నాంచారమ్మని, సరేనా?"

"భేష్, చాలా బావుంది."

"రాజా నీవు పాడుతూంటే తెలియని తన్మయత్వం కలుగుతోంది. నీ సంగీతం నాకూ..." మాలిని యింకా ఏదో చెప్పబోతుండగా రాజా మధ్యలోనే అందుకుని, "ఓ తప్పకుండా నీకు నేర్చుకోవాలనే అభిలాష ఉంటే రేపటి నుంచే ప్రారంభిస్తాను" అన్నాడు. ఆమె మొహంలో ఆనందం వెల్లివిరిసింది. ఆ మర్నాటినుండి మధ్యాహ్నం మూడునుండి నాలుగు గంటలవరకూ పాఠం చెప్పడానికి

నిశ్చయమైపోయింది. ఆమె రాజు యే జీవితంలోని ఆనం దాన్ని స్మరించుకుంటూ వెళ్ళింది యింట్లోకి.

సంగీత సాధనాపరురాలయిన మాలిని దృష్టి యెప్పుడూ సంగీతం పైననే లగ్నమై వుంటుంది. భర్త ఆనంద్ ధ్యాసే లేదు.

నెమ్మదిగా రాజూ మాలినిల హృదయాలు ఒకే వృత్తాన్ని బంధించబడినై. ఒకరినొకరు చూసుకోవాలనే అభిలాష, పాఠం చెప్పాలని అతనికీ, నేర్చుకోవాలని ఆమెకూ పట్టుదల ఎక్కువైపోయింది. యింటికి రాగానే ఆనంద్‌కు అన్నీ బోధపరిచేది.

డాక్టర్ ఆనంద్ ఎవర్నిగురించీ నీచంగా అనుమానపడే మనిషి కాదు. రెండేళ్ళకు పూర్వం మాలినికీ, ఆనంద్‌కీ పరిచయం కలుగజేసింది రాజాయే! కానీ ఎంచేతో ఆనాడు రాజా మొహం చూడటం ఆమెకు మనస్కరించేది కాదు. నీతి, భయం ఆమె హృదయాన్ని భయపెట్టాయేమో?

ఈనాడు రాజును గురించి సర్వస్వం అర్పించాలని మాలిని-మాలిని గురించి ప్రాణం అయినా యివ్వాలని రాజా ఉబలాటపడుతున్నారు. పాఠం పూర్తయిన తరువాత కూడా రోజూ మాలినీ-రాజాలు గంటలు తరబడి కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. సంగీతం గురించి ముఖ్యంగానూ, మిగిలిన విషయాల్ని గురించి సామాన్యంగానూ చర్చించుకునేవారు, అప్పుడప్పుడు మాలిని 'రాజావంటి కళాభిజ్ఞత మావారికి కలవడితే ఎంత భాగ్యంగాఉండేది' అనుకునేది.

ఐతే, అనుకోకుండా ఆమె హృదయక్షేత్రంలో రాజా ఒక రాగబీజం నాటాడు. అదె మొలకై లతై, పెరిగి పెద్దదై నేడు ఒక చిన్న నికుంజం అతనికి పోరవనిస్తోంది.

రాజా రాకుండానే అతని మేడదగ్గరకు వెళ్ళి ఎదురు చూస్తోంది మాలిని. ఎంతకూ అతడు రాలేదు. బయలు దేరింది ఆమె. రాజా ఎదురు వొస్తున్నాడు. కనుమేర దూరంలో చూసింది. ఆనందంతో ఆమె కళ్లు రెప రెప కొట్టుకున్నవి. హృదయం తీవ్రంగా స్పందిస్తోంది.

"హలో మాలినీ, షికారా?" అన్నాడు ఆమె దగ్గరగా వొచ్చి రాజా.

"ఔను, సాయంకాలం షికారు వెళ్ళేందుకు ఎవరికి సరదాగా వుండదు!"

"మరి ఒంటరిగా వెళుతున్నావేం?"

"జంట కెవరున్నారు?"

"ఆనంద్ రాలేదూ?"

"లేదు" అన్నది మాలిని, 'సరే' అంటూ రాజా ముందుకు వెళ్ళబోయాడు.

"రాజా, నేనూ వొస్తా."

"ఏం?"

"పాఠం మానడం ఎందుకులే!"

అతనింకేమీ మాట్లాడలేదు. ఇద్దరూ కలిసి రాజా యింటికి వెళ్లారు. మాలిని పాఠం చెప్పించుకొని అక్కడే

చీకటి పడేవరకూ కబుర్లు వేసుకు కూచున్నది. భర్తమాటే మరిచిపోయింది. రాజా సమక్షంలో యిప్పుడు అమృతం తాగినట్లు, కళ్ళల్లో అతని ఆనందాన్ని తాగెయ్యడమే మాలిని పని. అతను కొంటెతనంగా ముద్దుమాట అనే దాకా ఆ దాహం ఆమెకు తీరదు.

కాలం రాజాలో దాచుకొన్న వ్యామోహాన్ని పెంపొందించింది.

"మాలినీ!"

ఒక నిట్టూర్పు—

"ఏం రాజా?"

మరో రెండు నిట్టూర్పులు. గదిలో ఇంతవరకూ వెలుగుతున్న లైటు ఆరిపోయింది. రాజా నెమ్మదిగా మాలిని సరసకు చేరి, తన రెండు చేతులూ ఆమె వీపు వెనక చేర్చి దగ్గరకు లాక్కుంటున్నాడు. ఆమె నిర్వికారంగా వుంది. శూన్యంలోకి చూస్తోంది. ఆమెను గట్టిగా హృదయానికి అదుముకున్నాడు.

"తప్పు రాజా!" ఎందుకో మధ్యమధ్య నిట్టూర్పులు, కన్నీళ్ళు అతనామె మాటల్ని లెక్క చేయలేదు. చనువు తీసుకుని చొరవ చేయబోయాడు.

"నీకీ బుద్ధి ఎందుకొచ్చింది రాజా? వొదులు"

అతను వొదలలేదు. క్రమేణా తన పెదవుల్ని ఆమె పెదవులకు అంటించాడు.

"రాజా! ... అబ్బ...వొద్దలమంటే నీకొక్కదూ? అబలను ఏమిటీ బలవంతం. వొద్దులు రాజా!" మాలిని బిగ్గరగా ఒకసారి కేకపెట్టి మొహం పక్కకు తిప్పేసుకున్నది. ఆమె మనస్సంతా వ్యథాభిన్నం ఐపోయింది. కాని రాజాను 'గట్టిగా' కాదనలేకపోయింది.

మాలిని మనసులో ఏ భావం ఎట్లావున్నా అతనికి తొంగిపోయింది. కాని, ఆ మరుక్షణమే ఆమె దీనస్థితి అతన్ని వెనక్కి నెట్టింది.

"రాజా నీ కర్తవ్యాన్ని మర్చిపోయావ్" అని గర్జించింది అంతరాత్మ.

"ఆఁ" అని ఉలిక్కిపడి వింతగా చూశాడు. "రాజా నీ ధర్మాన్ని కర్తవ్యాన్ని నీవు మరచిపోయావు. ఆనంద్ నీకు ప్రాణమిత్రుడు. ఆమెకి పతిదేవుడు. తల నెంట్రుకవాసి కూడా అతనిపట్ల నీకున్న విద్యుక్తధర్మాన్ని విస్మరించరాదు. ఏమిటి నీ ఆదర్శం? ఆమెను వింతగా తయారుచేసి పవిత్రతతో ఆమెలోని ఆనందాన్ని నీవు పొందటం: అంతేగాని ఆమెను పొందాలని మాత్రం కాదుగా? ఇదేనా నీ నీతి, నీ ధర్మం? నీ విధి? పరస్త్రీను ప్రేమగా చూడడమా? నీవు ప్రేమిస్తున్నావా? కామిస్తున్నావా? చెప్పు?"

కామం ఇంద్రియాల్ని ఉద్రేకపరుస్తుంది. ప్రేమ ఆత్మను శాంతినిస్తుంది. కామం కత్తులతో ఆటలాడించి జీవితాన్ని నలిపి నాశనంచేస్తుంది. ప్రేమ త్యాగిష్ఠై ఎదుటివారి

శ్రేయస్సుకోరకు అవసరమైతే తనే నాశనం అవుతుంది. ఇతరుల జీవితాలకి హాని కలిగించదు. నీవు స్థిరహృదయంతో మాలినికి దూరంగావుంటే ఆమె తన జీవితంలో వెన్నెలను చూడగలిగి వుండేదిగా!''

'ఊఁ' అవునంది నుత్తెక్కిన అతని మనసు.

''మాలినీ! జరిగింది రాత్రి కలలోగాంచిన ఘట్టం అనుకో'' అన్నాడు.

ఆమెకు చీకటి కమ్మినట్లయింది. అంతా శూన్యం. ఏమీ తెలీని స్థితి. అయోమయం. కళ్ళు మూసుకుపోతున్నై. చెదిరిన దుస్తుల్ని సవరించుకొని గదినుండి బయటపడింది.

రాత్రి పదింటికి ఆనంద్ వచ్చాడు. ఇల్లంతా చీకటిగా వుంది. 'మాలినీ' అని పిలిచాడు. జవాబు రాలేదు. అంతలో 'లిల్లీ' తోక ఆడించుకొంటూ, అతని కాలు నాకి వంటింట్లోకి తీసుకొచ్చింది. తీరా చూస్తే మాలిని ఆ చీకట్లో గోడ నానుకుని కూర్చున్నది. ఆనంద్ లైటు వేశాడు. ఆమెలో చలనం లేదు. అది చూసిన అతని హృదయం తరుక్కుపోయింది. మాలిని చెయ్యి పట్టుకొని బలవంతాన హాల్లోకి బుజ్జగిస్తూ తీసుకు వెళ్ళాడు.

''మాలినీ! ఎందుకీ కన్నీళ్ళు? ఏం జరిగింది,'' చెప్పమని ఎన్నో విధాల బ్రతిమిలాడాడు.

''మోసం - ద్రోహం...అపవిత్రం''యీ మూడు పదాలు తప్ప ఆమె నోటినుండి మరోమాట రావడం లేదు.

"మోసం-ద్రోహం-అపవిత్ర మంటావు. వాటికని బాధపడే నీ వెట్లా అపవిత్రమౌతావు? నెమ్మదిగా నిద్రపో. నాకు నీవు-నీకు నేను. మన యిరువురిలో ఎవరు లేకున్నా ప్రపంచం లేదు ఉభయులకీ" అని ఆనంద్ ఆమె ప్రక్కనే కూచుని అట్లాగే నిద్రపొయ్యాడు.

దూరంగా చర్చిలో రెండుగంటలుకొట్టారు. కొన్ని గంటలకు ముందు జరిగిన ఒక్కొక్క ఘట్టం ఒక్కో బాకు పోటులా బాధిస్తోంది ఆమెను. తను నీచురాలు. తనను ఆరాధ్య దేవతలా కొలిచే పతికిద్రోహం చేసిన పాపాత్మురాలు. తనకీలోకంలో స్థానం లేదు. యీభూమిమీద తనకు బ్రతికే అధికారం లేదు. తనశరీరాన్ని ముక్కలుకింద కోసినా పాపం లేదనుకొన్నది.

గోడమీద ఏవో నీడలు 'నీవు దోషివి. ప్రతిఫలం అనుభవించ' మన్నవి. భయంతో ఆమె కళ్ళు మూసుకొన్నది. ఆ కళ్ళనలా శాశ్వతంగా మూయాలని వాంఛించింది.

వీధిలో గాలి వికృతంగా పైకెగిసింది. గాలికి వీధి తలుపులు 'టఫీ'మని మోసుకొన్నై. దొడ్లో ఆవు 'అంబా' అని అరిచింది. 'మాలినీ' అంటూ భయంకరంగా ఒక్క సారి ఉరుము వురిమినట్లు అరుస్తూ లేచాడు ఆనంద్. కట్టుపడిన మనసు ఆ రెండు జీవులనూ వేరు చేసింది. నీటి బుడగ విచ్చి పోయింది.

---

# వలపు తెమ్మెర

పగలల్లా లోకవిహారం చేసిన సూర్యభగవానుడు అలసి పశ్చిమానికి కృంగి పోతున్నాడు. ఆకాశం ఎర్రరంగు పూసుకుని ఎంతో అందంగా ఉంది. సముద్రపువొడ్డున ఇసుకలో మోకాళ్ళకు చేతులు కట్టుకు కూచుని ఏమిటో ఆలోచిస్తున్నాడు రాజారావు. గాలికి-కెరటాలు వొడ్డుకుచేరి మెల్లగా అతనిపాదాలను తాకుతూన్నవి. ఆగాలితెరలకు మధ్య మధ్య తట్టుకోలేక ఇసుకరేణువులు సుడులుతిరుగుతూ రివ్వునపైకిలేచి సముద్రంలో కలిసి పోతున్నాయి.

"రాజూ!"

ఎవరిదో పిలుపు వినిపించి చటుక్కున తలప్రక్కకి తిప్పాడురాజారావు. ఎదురుగా కనిపించిన యువతిని చూడగానే అతని కన్నులు వెలుగును వెదజల్లినై.

ఆమెహఠాత్తుగా, కనిపించి అతన్ని ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. అంతేగాదు; ఆనందాబ్ధిలో ఓలలాడించింది. ఆ ఆశ్చర్యానికి అంతులేదు; ఆ ఆనందానికి అవధుల్లేవు!

హాసంతోలాస్యం చేస్తూన్న అతని పెదవులు అస్పష్టంగా కదులాడినై. ఆమె పరిస్థితి కూడా అదేవిధంగా ఉన్నది.

"కూచో, ఇందిరా!" అన్నాడు రాజారావు ఓ మేకు చోటుచూపిస్తూ.

ఇందిర కూర్చూంటూ "మనం మళ్ళీ ఇన్నాళ్ళకు యిక్కడ కలుసుకోవటం నాకు చాలా సంతోషంగా ఉంది. ఈశుభసమయం ఇంత త్వరగా వొస్తుందనుకోలేదు!" అన్నది.

రాజారావు నవ్వాడు. ఆ నవ్వులో జీవకళ లేదుగాని. ఏదో సత్యం వున్నట్టు లీలగా తోచింది ఇందిరకి.

"ఇక్కడికి కెప్పుడొచ్చావ్, ఇందూ?" అన్నాడు.

"ఆయన కిక్కడేగా ఉద్యోగం. ఓహో...నీకు చెప్ప లేదుకదూ? ఎలక్ట్రికల్ ఇంజనీరు. రెండేళ్ళనుంచి ఇక్కడే వుంటున్నాము....ఆయన్ని పరిచయం చేస్తాను. ఇంటికిపోయి మంచి చెడ్డలు మాట్లాడుకుందాం. కారు అక్కడ పార్కు చేసి వొచ్చాను. పద, పోదాం?" అంది ఇందిర లేస్తూ.

రాజారావు ఆమెని వెంబడించాడు. ఇందిర పార్కింగ్ స్టేండ్‌లో వున్న తన ఫియట్ కారులో, డ్రైవింగ్ సీట్లోకూచుని స్టార్టు చేసింది. రాజారావు వెనుక సీట్లోకూచున్నాడు.

కారు బీచి వొడ్డున వెళ్తోంది. క్వీన్ మేరీస్ కాలేజి, రేడియోస్టేషన్, శాంథోమ్ చర్చి, లజ్ కార్నర్‌లు దాటి తేనాంపేట మీదుగా పోయి త్యాగరాయనగర్ నార్తుబోగ్ రోడ్డులోని ఓయింటి ముందుఆపి, హారన్ రెండుసార్లు మ్రోగించింది ఇందిర. వెంటనే తోటమాలివొచ్చి గేటుతీశాడు. కారులోపలికి వెళ్ళి పోర్టికోలో ఆగింది.

"పదరాజూ, లోపలికి!" అంది ఇందిర కారుదిగుతూ. రాజుకూడా దిగి, ఆమెను అనుసరించాడు. ఇందిర అతన్ని డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చోబెట్టి-

"ఉండు, ఇప్పుడే వొస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది.

అక్కడున్న ఓ సోఫాలో కూచుని ఆగదంతా పరిశీలించాడు రాజు. విశాలమైనగది. గోడలకు నాలుగువైపులా అలంకరించబడ్డ అందమైన ఫొటోలు. దేశస్వాతంత్ర్యంకోసం తనయావచ్ఛక్తినీ వినియోగించి, బ్రిటిష్‌వారితో పోరాడి, తీరా అది సిద్ధించాక భారతదేశ పురోగమనాన్ని పరికించకుండానే పరలోకాని కేగిన అమరమూర్తి, భారత పిత బాపూజీ వర్ణచిత్రం వాటిమధ్యలో వెళ్ళాడుతోంది. మొసాయిక్ ఫ్లోరింగ్ మీద అందంగా - మెత్తగావున్న తివాసీ పరచపడివుంది. సోఫాలు, ఓమూలగా ఫిలిప్స్ రేడియో, దానిప్రక్కనే ఎత్తైన పీటమీద బుద్ధభగవానుని విగ్రహం. ప్రశాంతమైన ఆభగవంతుని వదనం-లోకానికి ఏదో సందేశం అందజేసేట్టుగా వుంది.

సద్వర్తన, జాలి, కరుణ ఆయననుంచే ఉదయించాయోమో అనుకున్నాడు రాజారావు.

ఇంతలో పొగలుకక్కుతున్న కాఫీతో వచ్చింది ఇందిర. ట్రేలోంచి ఓకప్పు అతనికిచ్చి, రెండోది తను తీసుకుంది.

"రాజూ!"

"ఊ!"

"నువ్వు చాలామారి పోయావ్ ?" అంది ఇందిర.

కాలం మారుతూంది. దానిపాటు మనుషులు కూడా మారకతప్పదుగా!" కాఫీ సిప్ చేస్తూఅన్నాడురాజు.

"నే చెప్పేది అదికాదు రాజూ! ... చదువుకునే రోజుల్లో ఎంతఅల్లరి చేసేవాడివి?...ఆచలాకీ, చిలిపితనం నీలో ఎంత వెదికినా ఇప్పుడు కనిపించవేం?"

"ఆమాటకొస్తే నువ్వుమాత్రం! ... నీ మెళ్ళో తాళి నుదుటున నయాపైనా అంతబొట్టు...ఇవన్నీ చూస్తూంటే నీముందు చాలా చిన్నపిల్లాడినేమో అనిపిస్తోంది." అంటూ రాజారావు ఖాళీఐన కాఫీకప్పుని టీపాయ్ మీదున్న ట్రేలో పెట్టాడు. ఇందిర నవ్వింది.

"ఆఁ, ఇంతకీ నువ్వు ఏం జేస్తున్నట్టు?" అన్నది.

"'జనరంజని' వారపత్రికలో సబ్ ఎడిటర్‌గా జాయినయ్యాను. 'కథలసెక్షన్' మాత్రమే చూస్తాను ... చేరి అంతా ఆరుమాసాలయింది. నూట ఏభై ఇస్తారు:"

"పెళ్ళి చేసుకున్నావా?"

"ఆమాట నువ్వే అడుగుతున్నావా ఇందూ!" అన్నాడు బాధగా రాజారావు.

"క్షమించురాజూ, అనుకోకుండా నీమనసు బాధ పెట్టాను."...అన్నది.

ఆ తరువాత టాపిక్ మార్చి, ఇందిర తనగురించీ, తనభర్త గురించీ ఎన్నో సంగతులు చెప్పింది. ఆయనకి కార్పొరేషన్ వాళ్లు నాలుగొందలు జీతం యిస్తున్నారట; చాలా మంచివాళ్లు! పిల్లా, జిల్లా లేర్ట! ఆమె జీవితం ఎంతో హాయిగా సుఖంగా సాగిపోతున్నదిట!

ఇందిర లేచి ఇల్లంతా చూపించింది రాజారావుకి... ఐదుగదులు ఒకహాలుఉన్న డాబాయిల్లు అది. ఎంతో సింపుల్ గా, అందంగాఉంది. ఇంటివెనక దొడ్లో వైపు; ముందు భాగాన లాన్ వున్నాయి.

కొంతసేపటికి ఇందిరభర్త మోహన్ రావు కార్పొరేషన్ వాళ్ళ కారులో దిగాడు. భర్తకి కాఫీయిచ్చి రాజారావుని పరిచయం చేసింది అతని ఉద్యోగవివరాలవీ చెప్పింది.

మోహన్ రావు నిగర్వి, నిరాండంబరుడూను. ప్రతి వాళ్ళతోనూ చాలా సోషల్ గా మూవ్ అవుతాడు. ఇందిర అంటే అతనికి పంచప్రాణాలు. ఆమె ఎంతచెబితే అంత!

"నిజంగా యివాళ మిమ్మల్ని కలుసుకోగలగటం అదృష్టమనే అనుకోవాలి. మీగురించి ఇందిర అప్పుడప్పుడూ చెబుతూ వుంటుంది." అన్నాడు మోహన్ రావు—రాజారావుతో.

"నాలో ఏమంత విశేషం వుందని?"

"విశేషం కాదక్కడ ముఖ్యం, స్నేహం! ఆ స్నేహ పాశం ఒక్కోరిపట్ల ఎంతో బలంగా పని చేస్తుంది. ఆఁ, మీరిప్పుడెక్కడ ఉంటున్నారు?" మోహన్ రావు అడిగాడు.

"మైలాపూర్ లో"

"వ్హాట్?...మాఇందుకి స్నేహితులైఉండి, ఎక్కడో మైలాపూర్ లో ఒంటరిగా ఉంటున్నారా? ఇహనుంచి అదేం వీల్లేదు, మాయింటికొచ్చెయ్యండి. ఇక్కడే ఉందురుగాని" అన్నాడు.

అతని హృదయ సౌజన్యానికి, సౌహార్ద్రతకీ మనసులోనే కృతజ్ఞతలు తెల్పుకొన్నాడు రాజారావు. ఇందిరపట్ల మోహన్ రావుకి ఎట్లాంటి సదభిప్రాయమూ, గౌరవమూ ఉన్నవో అర్థమైంది అతనికి.

"థాంక్స్. ... కాని, ఇక్కడ వుండలేను; క్షమించండి!" అన్నాడు.

ఇందిర దీనంగా రాజారావు మొహంలోకి చూస్తూ "నీ మంచి చెడ్డల్ని చూసే అవకాశమైనా నాకు యివ్వవా రాజూ?" అన్నది.

ఆ పలుకులు అతనివొంటికి ములుకులై సోకినయ్. ఇందిర మాటను త్రోసివెయ్యలేకపోయాడు. మోహన్ రావు కల్పించుకుని "ఈపూటకి ఇక్కడే భోజనం. పొద్దుటే కారు పంపిస్తాను. సామాన్లు తీసుకు వొచ్చెయ్యండి" అన్నాడు.

రాత్రి ఎనిమిది గంటలను పైగా అయింది. గదికొచ్చి మంచంమీద పడుకున్నాడన్న మాటేగాని, ఇందిర తాలూకు ఆలోచనలు రాజారావు మస్తిష్కంలో మెదులుతున్నాయి. కిటికీనుండి వొచ్చిన చల్లని గాలి తెర అతన్ని కుదిపి మూడు వసంతాల వెనక్కి నెట్టింది.



రాజారావు ఆర్ట్సు కాలేజీలో బి. ఎ. ఫైనలియర్ చదువుతున్న రోజులవి. తల్లిదండ్రులు చిన్నప్పుడే గతించారు. మేనమేమ విశ్వేశ్వరయ్యా పెంచి పెద్దజేసి చదువు చెప్పిస్తున్నాడు. ఆయనేం భాగ్యవంతుడు కాడు; మామూలు సామాన్య కుటుంబీకుడు. కుచేల సంతానంలా విశ్వేశ్వరయ్యకి ఆరుగురు పిల్లలు. అందులో నలుగురు ఆడవాళ్లు; ఇద్దరు మొగపిల్లలూను. పిల్లలంతా బాగా పిన్నవయస్కులు. వాళ్ళతో బాటే రాజారావునుకూడా తన వాడిగానే భావించి పోషిస్తున్నాడు. ఎంతైనా చెల్లెలికొడుకు: ఏం జేస్తాడుమరి ?...పోషించక !

రాజారావు ఆయన అభిప్రాయాలకు అనుగుణంగా నడుచుకునేవాడు. ఏదైనా కావలసివొస్తే-అదీ ఎంతో అవసరమైతేనేగాని విశ్వేశ్వరయ్యగార్ని అడిగేవాడు కాదు. అతని తెలివితేటలూ, నెమ్మదితనానికిలోలోపలే మురిసేవాడుఆయన.

రాజారావు ఓసారి కాలేజీ డిబేట్‌లో పాల్గొన్నాడు. 'మహిళలూ--అభ్యుదయమూ' అన్నసమస్యపై ఆనాడు ఉప

న్యాసమిచ్చి ప్రథమబహుమతి గెల్చుకున్నాడు. అప్పుడే అత నికి తొలిసారిగా ఇందిరతో పరిచయమైంది. వారిద్దరూ సహాధ్యాయులైనా ఇంతకుముందెన్నడూ ఒకరితో ఒకరు మాట్లాడుకుని ఎరుగరు.

"ఇవాళ మీ ఉపన్యాసంఎంతో బావుంది. నేనే కాదు, నా ఫ్రెండ్స్‌కూడా ఎంతో మెచ్చుకున్నారు. మీ ఆశయాలు, అభిప్రాయాలు అంత ఉన్నతంగా ఉంటవని నేనేనాడూ అను కోలేదు!" రాజారావుని ఏకాంతంగా కలుసుకుని అన్నది. ఇందిర.

రాజారావు ఓక్షణం ఆమెవైపుచూసి- "నాపైమీకు గల సదభిప్రాయానికి థాంక్స్!" అన్నాడు.

ఇందిర పెద్ద అందగత్తె గాకపోయినా ఇతరులను ఆక ర్షించే గుణం ఆమెలోవుంది. ఎప్పుడూ చలాకీగా నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ ఉంటుంది.

"ఆఁ, రేపు ఆదివారం మీకు ఖాళీయేగా! సాయిం కాలం నాలుగ్గంటలికి మాయింటికో సారి రండి" అంది వెళ్ళేందుకు ఉద్యుక్తురాలవుతూ.

"అట్లాగే, తప్పకుండా!" అన్నాడు — ఆమెకు వీడ్కోలు చెబుతూ.

ఆమర్నాడు సాయింకాలం నాలుగు గంటలకి టిప్, టాప్‌గా డ్రెస్ చేసుకుని ఆల్‌కట్ తోటలోని లాయరు కామే శ్వర్రావుగారింటికి బయలుదేరాడు.

కామేశ్వర్రావు ఇందిర తండ్రి, మనిషి లావుగా, బొద్దుగా, పొట్టిగా ఉంటాడు. బుర్ర చిన్నదైనా మెదడు మహాగట్టిది. రాజారావు గుమ్మంలోకి అడుగు పెట్టగానే ఆయనే ఎదురువొచ్చాడు.

"ఎవరుకావాలి?" మృదువుగా అడిగాడు.

"ఇందిరకోసం!" అన్నాడు నెమ్మదిగా.

ఆయనపిలిచాడు. మరుక్షణంలో ఇందిరయివతలికి వొచ్చింది. అతన్ని తండ్రికిపరిచయం చేస్తూ-

"ఈయనే నాన్నా నేను రాత్రిచెప్పలా! 'మహిళలూ అభ్యుదయమూ' అన్నశీర్షికపై చక్కగా ఉపన్యాసమిచ్చారని.

"ఓహో అట్లాగా సంతోషం! నీపేరేమిటోయ్?"

"రాజారావు!"

"అమ్మాయ్! మీయిద్దరూ మాట్లాడుతూ కూచోండి నాకుకాస్త బజారుపనుంది; అట్లా వెళ్ళొస్తాను" అంటూ కామేశ్వర్రావుగారు కారులో వెళ్ళిపోయారు. ఆ తర్వాత ఇందిర లోపలికి వెళ్ళి 'టీ' తీసుకొచ్చియిచ్చింది.

"థాంక్స్...ఇప్పుడే తీసుకొచ్చాను!"

"మొహమాట పడకండి. అసలు మిమ్మల్ని పిలిచింది 'టీ' కోసమే" అంది.

"ఊ," అంటూ ఆమెకళ్ళల్లోకి చిలిపిగాచూసి నవ్వాడు రాజారావు.

ఇందిరవొళ్లంతా ఎవరో గిలిగింతలు పెట్టినట్లయింది. సిగ్గుతో తలవొంచుకుంది.

"మరి నే వెళ్లేదా!" అంటూ లేచాడు కుర్చీలోంచి.

"అప్పుడేనా ?" అన్నదామె.

"పిలిస్తే-మరోసారి ఎప్పుడైనా వొస్తాను!"

రాజారావుతో ఏదో మాట్లాడాలనీ, ఎన్నో విషయాలు చెప్పాలనీ మొదట్లో అనుకున్నది ఇందిర. కానీ తీరా అతను, 'వెళతా' ననేసరికి-అవన్నీ పెదవిదాటి పైకిరాలేకపోయినయ్.

నిజానికి-అతనికి అక్కణ్ణించి వెళ్ళాలని లేదు; ఉండేందుకు-ఆమెకీ తనకీ మధ్య పెద్దస్నేహమూ లేదు, తగిన కారణమూ లేదు. గంటల తరబడి ఆమెముందు కూచుని తన విలువ తగ్గించుకోలేడు! అందుకే వెళ్ళకతప్పిందికాదు.

అప్పట్నుంచి ప్రతిదినమూ వాళ్ళిద్దరూ కాలేజీలో నే కాకుండా వీధిలోకూడా కలుసుకునేవాళ్లు. ఆ పరిచయం స్నేహంగా దినదినాభివృద్ధి నొందుతూ ప్రేమగా మారింది. ఈ విషయం కాలేజీలోని అన్నిక్లాసులవాళ్లకీ తెలిసిపోయింది. వాళ్ళపేర్లు సువర్ణాక్షరాలతో కాకపోయినా సుద్దముక్కలతో కాలేజీగోడలనిండా ముద్రితమైనాయి - రంగురంగుల డిజైన్లలో.

ఓనాటి సాయింకాలం రాజారావు, ఇందిరకాల్లో ఇంటికి వెళుతూ "కాలేజీలో ఎక్కడచూసినా, విన్నా మన పేర్లే మ్రోగిపోతున్నాయి. ఈవిషయం గురించి నీవేమీ భయపడటంలేదా ?" అన్నాడు.

"ఎందుకూ, భయం? ఎట్లాగూ మనం వివాహం చేసుకోబోతున్నాంగా! ఈ పబ్లిసిటీ ఓవిధంగా మంచిదే. వాళ్ళకు ప్రత్యేకంగా ఆహ్వానాలు పంపనక్కరలేదు. కొంత మేలే, రక్షించారు!" అన్నది తొణుకూ, బెణుకూ లేకుండా-ధీవిగా.

ధైర్యోత్సాహాలకి మారుపేరు 'ఇందిర' అనుకున్నాడు రాజారావు ఆ క్షణాన.

అన్నీ మనం అనుకున్నట్టుగా జరుగవు. ఒక్కోసారి అవి విరుద్ధఫలితాల నిస్తాయి. ఇందిర విషయంలో అక్షరాలా అట్లాగే జరిగింది,

ఆరాత్రి భోజనాలైనాక కూతుర్ని తనగదిలోకి పిలిచారు కామేశ్వరరావుగారు. ఆమెవొచ్చి తండ్రికెదురుగా వున్న మరోకుర్చీలో కూచున్నది.

"అమ్మాయ్! రాజారావూ, నీవూ చాలా అన్యోన్యంగానూ, అదేదో ప్రేమగానూ ఉంటున్నారుట ... నిజమేనా?" అన్నారు.

ఇందిర మాట్లాడలేదు. మౌనంగా తలవొంచుకున్నది. "చెప్పమ్మా! సిగ్గెందుకూ?"

"నిజమే నాన్నా! మీ అనుమతి తీసుకొని పెళ్ళి కూడా చేసుకొందామనుకొంటున్నాం" అంది.

"అదే నిజమైతే ఈ పెళ్ళి జరుగదు ... అసంభవం కూడాను!"

"నాన్నా!" బాధగా బరువుగా అంది ఇందిర. ఆశలన్నీ అగాధంలోకి కూలిపోతున్నట్లనిపించింది.

"అవునమ్మా! నా కూతుర్ని ఆస్థిపాస్థులు, హోదా, గౌరవం లేనివాడికి కట్టబెట్టి ఆ తర్వాత ఏర్పడే కంటకాలను చూస్తూ కూర్చోలేను. మంచి ఉద్యోగం, డబ్బు ఉన్నవాడికే కోరినంత కట్నం ప్రమ్మరించి నిన్ను నేను విన్నాను...లాయరు కామేశ్వర్రావు మాటకి కోర్టులోనే కాదు; ఎక్కడా తిరుగు లేదని నీకూ తెలుసుగా!" అంటూ రివాల్వింగుకర్చీలో ఓసారి గిర్రున తిరిగి ఆ గదిలోంచి బయటికి వెళ్ళిపోయాడాయన.

ఇందిరలో దుఃఖం పెల్లుబుకుతున్నది. అరికట్టుకునే శక్తి ఆమెలో సన్నగిల్లి, వెక్కి వెక్కి ఏడ్వసాగింది. పైన తిరుగుతున్న సీలింగ్ ఫాన్ వలెనే, ఆమె బుర్రలో ఆలోచనలు తిరుగాడుతూ మనసును కలచివేస్తున్నాయి. రాజారావు గురించి ఆమె ఎన్నో కమ్మనికలలు కన్నది. ఆ కలలన్నీ ఇప్పుడు తండ్రిమాటలతో కల్లలయ్యేసరికి ఈ బ్రతుకును భరించగలనా? అనుకున్నది. ఏమైనా ఆరాత్రి ఇందిరకు నిద్రపట్టలేదు.

రెండురోజులపాటు కాలేజికి పోలేదు; మూడోనాటి ఉదయం రాజారావును బజారులో కలుసుకొని, కార్లో ఎక్కించుకుంది. జనసంచారంతక్కువగాఉండే శానిటోరియం ప్రాంతా

నికి తీసుకువెళ్ళి ఓచోట ఆపింది కారుని. రాజారావుగుండె లపై తలదాచుకొని భావురుమని ఏడ్చింది ఇందిర. ఆమెవీపు నిమురుతూ "ఏడవకు, ఇందూ? నీబాధ నాకు తెలుసు... మూడురోజులక్రితం మీ నాన్నవొచ్చి పరిస్థితి వివరించారు. మనయిద్దరికీ మధ్య 'అంతస్థు' అనే ఉక్కుతెర అడ్డుగావుంది. మనకలయికను సమాజం హర్షించదు!" అన్నాడురాజా రావు.

"నువ్వుకూడా అదేమాట అంటున్నావా రాజూ!" అందిఇందిర ఎక్కుతూ.

"పిచ్చిపిల్లా, ... నాకుమాత్రం బాధగా లేదను కున్నావా?-కన్నవాళ్ళకు కష్టంకలిగించకూడదు. మధ్యలో ఏర్పడ్డ మనప్రేమకోసం, చిన్నప్పటినుంచి కనిపెంచిన పెద్ద వాళ్ళప్రేమని త్రెంచివేయుట మంచిదా? ఆలోచించు!" నీకొకరు చెప్పవలసిన పనేముంది?" ఇందిరకన్నీళ్ళను ముని వ్రేళ్ళతో తుడుస్తూఅన్నాడు.

"అందుకోసం మన జీవితాలను బలితీసుకోవటం అన్యాయం కాదా?"

"చూడు, ఇందూన్యాయమూ, అన్యాయమూతర్వాత విషయాలు. ముందు పెద్దవాళ్ళమాటను మన్నించటమే మన విద్యుక్తధర్మం"

"ఇది జీవన సమస్య రాజూ!"

"అందుకే మీనాన్న అభిప్రాయాన్ని అంగీకరించాను. నీవువెవర్నికట్టుకున్నా, ఎక్కడున్నా నీ సుఖసంతోషాలే నాకు కావలసింది, నేను కోరేదీకూడా."

ఈమాటలు విని ఆమె మరోసారి భోరున ఏడ్చేసింది. ఆమెవెచ్చని కన్నీరు, అతనిగుండెల్ని తడిపివేస్తోంటే తన హృదయాన్నెవరో పట్టిపిండుతున్నట్లుగా వుంది రాజారావుకి 'తనుచస్తే ఎంతబావుండేది! ఈ పరిస్థితి చూసేందుకేనా తనింకా జీవించిఉన్నది? అనుకున్నాడు. కన్నీరు బయటికి రాకుండా రెప్పలను రెండుమూడుసార్లు తాటించి, గొంతు నిండుగావున్న విషాదాన్ని దిగ్రమింగుకొంటూ—

"ఇందూ, నువ్వింత బేలవనుకోలేదు: ... ఏడుస్తూ కూచుంటే చివరికిమిగిలేది ఆవేదనమాత్రమే!...బ్రతుకును ఆనందమయం చేసుకోవాలిగాని, దుఃఖభాజనం చేసుకోగూడదు!...మీనాన్న చూసినవరుణ్ణి చేసుకుని, అతన్నిసుఖపెట్టి నువ్వుసంతోషపడు!...అప్పుడప్పుడు నిన్నుచూసేందుకు వొస్తూవుంటానుగా—ఏదీ, ఇటుచూడు, నవ్వాలి మరి! "అన్నాడు.

ఆమెనావిధంగా మెప్పించి, ఒప్పించి, నవ్వించివొచ్చేశాడు. ఆనాటినుంచి ఇందిరకు రాజారావుగాని, రాజారావుకి ఇందిరగాని మళ్ళీఏనాడూ, ఎక్కడాతారసపడలేదు. ఆగాధ తాలూకు వ్యథ ఇందిర కాలక్రమేణా మర్చిపోగలిగినా అతను మాత్రం మరువలేకపోయాడు.



స్మృతి చెదిరిపోయింది. రాజారావు కన్నులు చెమ్మగిల్లాయి. ఆలోచనలభారంతో ఆరాత్రి అతనికి సరిగా నిద్రపట్టలేదు. ఉదయం లేచేసరికి ఏడుగంటలకు పైగా అయింది. తలుపుతీసుకువొచ్చేప్పటికి గుమ్మంలో మోహనరావు కారు సిద్ధంగా ఉంది. డ్రైవరు కారుప్రక్కనే నిలబడి బీడీదమ్ములాగుతున్నాడు.

రాజారావుని చూడగానే నమస్కారంచేసి "సార్, అయ్యగారు మిమ్మల్ని సామాన్లతో సహా తీసుకురమ్మన్నారు" అన్నాడు.

రాజారావు నవ్వాడు. కాలకృత్యాలు పూర్తిచేసుకుని సామాన్లు పేక్ చేసి కార్లోకి ఎక్కించాడు. గుమ్మంలో ఆగగానే ఇందిరా, మోహన్‌రావు చిరునవ్వుతో ఆహ్వానించారు.

అంతవరకూ వాళ్ళు 'గెస్ట్‌హౌస్'గా వాడుతున్న గదిని శుభ్రంచేయించి రాజారావు స్వంతం చేశారు. మోహన్‌రావు, పరామర్శలవీ అయ్యాక హాల్లోని సోఫాలో కూచుని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' చదవటంలో నిమగ్నుడయ్యాడు.

రాజారావు పుస్తకాలు అల్మైరాలో సర్దుకుంటూండగా ఇందిర కాఫీ కలుపుకొచ్చి "తీసుకో రాజూ!" అంది.

"వొద్దు ఇందిరా, తోవలో స్టేట్స్‌హోటల్లో డ్రైవరూ, నేనూ ఇప్పుడే తీసుకున్నాం."

"ఫర్వాలేదు, కాఫీయేగా, ఎన్నిసార్లైనా తాగచ్చు. అందులోనూ నువ్వు రచయితవి. హాట్ కాఫీ తాగితే స్వీట్ మూడ్స్ వొస్తాయి" అంటూ నవ్వి, కప్పు అతనిచేతి కందించింది.

రాజారావుకిహ తప్పిందికాదు. కాఫీ తాగుతూ "ఇందిరా, నీలోని ఏ అద్భుతశక్తో నన్ను లొంగదీసుకుంది. నీ మాటను ఎదిరించేశక్తి నాలో సన్నగిల్లుతున్నది. ఎందుకో నాకు బోధపడటంలేదు. పైగా నీవంటే తగని భయమూ, గౌరవమూకూడా ఏర్పడుతున్నవి" అన్నాడు - తలవొంచుకుని.

ఆమె వేదాంతినిలా నవ్వింది.

రోజులు గడుస్తున్నాయి. రాజారావు ఆఫీసుకు వెళ్ళి వొస్తున్నాడన్న మాటేగాని, అతనిలో ఏవిధమైన ఉత్సాహమూ ఉండటంలేదు. అర్థంకాని ఏదో ఆవేదన అతన్ని ఆవరించుకొంటున్నది.

ఐతే, ఇందిర అతని పరిస్థితిని గ్రహించకపోలేదు. ఆ విషయం జ్ఞప్తికొచ్చినప్పుడల్లా ఆమె ఎంతో బాధపడేది. అతని జీవితనాటకంలో తన పాత్రకు ఎంత ప్రాధాన్యత ఉన్నదో-ఆ పాత్ర ప్రభావం అతన్ని ఎట్లా పెనవేసుకున్నదో తెలుసుకుని తలచుకుని కుమిలిపోయేది.

ఆమెబాధ ప్రపంచానికి ఎట్లా అర్థమౌతుంది? ఆమె మనోవ్యథ ఎవరికి తెలుస్తుంది?

ఒక రోజు రాత్రి...

పది గంటలకు పైగా అయింది. రాజు టేబిల్ ముందున్న కుర్చీలో కూచుని ఏదో ఆర్టికల్ వ్రాసుకుంటున్నాడు. టేబుల్ లైటు కాంతి అతను వ్రాస్తున్న కాయితాలపై సన్నగా పడుతోంది.

"పాలు!" గాజులున్న చెయ్యి అతని ముందుకొచ్చింది. రాజు గమనించలేదు.

"అక్కడ పెట్టివెళ్ళు" అన్నాడు తల పైకెత్తకుండానే.

ఐనా ఆమె పాలగ్లాసు అక్కడ ఉంచి వెళ్ళలేదు. అతని ప్రక్కనే నిలబడి ఉన్నది.

"చప్పున తీసుకోండి, లేకుంటే చల్లారిపోతాయి."

కన్నులెత్తి ఆమెవైపు చూశాడు. ఒక్షణంపాటు ఆశ్చర్యం చెందాడు.

"క్షమించండి, పనిమనిషనుకొన్నాను...మీరెవరో తెలియబరుస్తే..."

అతనిచూపు లామెను సిగ్గుపరుస్తున్నవి. పాలగ్లాసు టేబుల్ పైపెట్టి అక్కణ్ణించి తుర్రున లోపలికి పారిపోయింది.

ఇందిర పోలికలుగల ఆ యువతి ఎవరో అర్థంకాలేదు రాజుకి. నీలాల్లో మెరిసే ఆమె నల్లని కన్నులు ఇంకా అతనికి కనిపిస్తూనే ఉన్నవి. మాటల్లో మృదుత్వం, ముఖంలో నిర్మలత్వం అతన్ని ఆలోచనలకు గురిచేస్తున్నవి.

తెల్లవారింది. గదిలో గాజులచప్పుడు వినిపించి చటుక్కున కళ్ళు విప్పాడు రాజు. 'ఆమె' కనిపించింది. బుక్ షెల్ఫ్ దగ్గర నిలబడి అందులోని పుస్తకాలను ఒక్కొక్కటీ చూస్తోంది. ఆవులిస్తూ పైకిలేచాడు. ఆమె వెనుదిరిగి చూసింది.

"టీపాయ్ మీద కాఫీకప్పు ఉంది. చెయ్యి తగిలితే పగులుతుంది. కాఫీ అంతా వొలికిపోతుంది."

ఆమెపలుకుల్లోని సునిశిత, చిలిపితనం రాజుని ఆకర్షించాయ్. వెల్వెట్ జాకెట్ పై ఆమెవేసుకున్న ఎర్రంచు గ్లాస్కోచీర ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తోంది.

"ఓహో, గుడ్ గాడ్, నాగురించి మీకెందుక్ శ్రమ మిస్ ..."

"మంజుల!" అంటూ అక్కణ్ణించి అవతలికి పోయింది ఆ అమ్మాయి.

"మిస్ మంజులా!"

ఆమె వెనక్కి తిరిగింది. ఓరగా చూసి సన్నగా నవ్వింది.

అచేతనుడై ఆమెనే చూస్తూ కూచున్నాడు. కిలకిల నవ్వుతూ కదలి వెళ్ళిపోయింది మంజుల. గొంతులోని మాధుర్యం, నడకలోని హొయలు దేవకన్యను మరపింపకేస్తున్నయ్.

భోజనాలవేళ ఇందిర చెప్పింది; "మంజుల మాపిన్ని గారమ్మాయి. ఇక్కడేవుండి సెల్లామేరీస్‌లో బి. యస్. సి చదువుతోంది. సెలవులకని పదిరోజులక్రితం వాళ్ళస్వగ్రామ మైన నల్లూరు వెళ్ళి-నిన్ననే వొచ్చింది."

రాజు మౌనంగా తలపంకించాడు.

మంజులకు మహాబలిపురం చూడాలనే వాంఛ ఎన్నాళ్ళగానో ఉంది. ఐతే ఇంతవరకూ తోడులేక వెళ్ళటం పడలేదు. తనకోరికను అక్కతో చెప్పింది - ఆమె తీసుకువెళ్తుందను కొని. ఐతే మంజుల అనుకున్నట్టుగా జరుగలేదు. ఇందిర - తనచెల్లెల్ని మహాబలిపురం రేపు ఆదివారం (తీజరునాడు) ఓసారి తీసుకువెళ్ళి అక్కడి దృశ్యాలవీ చూపించమని రాజునుకోరింది. ఇందిరమాటను కొట్టివేసే అలవాటు అతనికి ఏనాడూ లేదుగనుక మంజులకు మహాబలిపురం చూపించేం దుకు ఒప్పుకున్నాడు.

ఆ ఆదివారం రాజు, మంజుల స్వంతకారులో మహాబలి పురం పిక్నిక్ బయలుదేరారు. అక్కడికిచేరాక పల్లవరాజుల వైభవాన్ని, శిలాప్రతిమలసౌందర్యాన్ని; ఉద్యానవనం-అన్ని చూస్తూ మధ్యాహ్నందాకా గడిపారు. తనకు తెలీని విష యాల్ని రాజునడిగి తెలుసుకుంటోంది మంజుల. అన్నిటికీ అతను ఓపికగా సమాధానాలు చెబుతోన్నాడు. చివరికి ఫలహారాలుపెట్టిన చెట్టుక్రిందకు చేరారు. కారియర్ విప్పించి మంజుల. రెండువిస్తర్లువేసి వొడ్డించింది.

"నేను భోంచేయను." అన్నాడురాజు.

"ఏం?" అంది ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

నా కాకలిగా లేదు. మీరుతినండి," అన్నాడు రాజు.

"ఏంతిన్నారని ఆకలిలేకపోవడం? పొద్దుటవ్వ కాఫీ యేగా మీరు తాగారు. అదైనా నేనేగాయిచ్చింది. ఈలోగా నాకు తెలీకుండా ఏదైనా తిన్నారనుకునేందుకు అప్పట్నుంచీ మీ వెంటే వున్నానుమరి..."

"నిజమేమంజులా; తిండిమీదధ్యాస ఎందుకనో తగ్గింది"

"నావల్ల మీ కేదైనా కష్టంకలిగితే క్షమించండి. కాని భోజనంమాత్రం మానవద్దు." అంది మంజుల దాదాపు మొహంలో దీనత్వాన్ని కనబరుస్తూ.

"నేనొకటంటే, నువ్వొకటి కల్పించుకుంటున్నావ్, నన్నుకాస్త అర్థంచేసుకోమంజూ!" అన్నాడు-ఆమె అనవసరంగా బాధపడ్తోందనుకుని.

ఎట్లా అర్థంచేసుకోమంటారు రాజూ ...ఆవిషయంలో అనేకసార్లు ప్రయత్నంచేసి విఫలురాలినయ్యాను; మీ స్థితి నన్నుదహించివేస్తోంది. కణకణ మండుతున్న అగ్నిగుండాలేవో మీలో చెలరేగుతున్నాయి. అంత బాధా మీ రొక్కరే ఎట్లాభరించగలుగుతున్నారో నా కసూహ్యంగా ఉంది. నేను కూడా అందులో పాలుపంచుకొని మీ బరువు కొంత తగ్గించాలనివుంది...అదేమిటో చెప్పరూ?"

చలాకీ, చిలిపితనం అక్షణాన తననుంచి మాయమై మూర్తీభవించిన శోకదేవతవలె ఉంది మంజుల.

"మంజూ, చెప్పను! ఇప్పుడేమీ చెప్పలేను. ఇవాళ కదపకు. మళ్ళెప్పుడేనా చెబుతాను!"

ఆమె హాయిగా నవ్వి "చెప్పకపోతే పోనీలెండి. మీరు భోజనంచేసి తీరాలి నాకోసమైనా."

ఆమెమాటల్లో ఆజ్ఞ లేదు; ఆప్యాయత ఉంది. అధికారం లేదు; ఏదో తెలీని అనుబంధం ఉంది.

తల పైకెత్తి మంజుల ముఖంలోకి చూశాడు. ఆమె కనుకొలకుల్లో నీరు నిలిచింది. తనపట్ల ఆమె కెందుకా జాలి? ఎందుకని తనపై అంత శ్రద్ధ తీసుకొంటున్నది? అవగాహన చేసుకోలేక పోతున్నాడు రాజు. 'నాకోసమైనా' అనే ఆమె మాట అతన్ని కదిపి, కుదిపేసింది. మారు మాట్లాడకుండా విస్తట్లో చెయ్యిపెట్టి అన్నం కలిపాడు. అది చూసి మంజుల తృప్తిగా ఊపిరిపీల్చుకొని తానుకూడ భోజనానికుపక్రమించింది



రాజు గదిలో కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. గదిలో అడుగుల చప్పుడు వినబడేప్పటికి తలెత్తి పైకి చూశాడు. మంజుల కొంటెచూపులు చూస్తూ—

"మిమ్మల్ని అక్కయ్య పిలుస్తోంది" అన్నది.

ఓహో, తను ఆ విషయమే మరిచిపోయాడు. ఇంతకు ముందొకసారి కబురంపింది ఇందిర పనిమనిషిచేత. తను వ్రాతలోపడి 'అల్లాగే' నన్నాడు కాని, ఇప్పటివరకూ పోలేదు. ఏమనుకుంటుందో ఏమో!

"సరే, పద!" అంటూ మంజులను వెంబడించి ఇందిర గదిలోకి వెళ్ళాడు.

అతన్ని తనకెదురుగావున్న మరో సోఫాలో కూర్చో మన్నది ఇందిర. మంజుల అక్కణ్ణించి తన గదిలోకి వెళ్ళి పోతున్నట్లు కనిపించింది, ఏదో అత్యవసరమైన పని ఉన్న ట్లుగా.

మోహన్ రావు బయటికి వెళ్ళి చాలా సేపయింది. "రాజూ, నేనొకటడుగుతాను. నాకోర్కె తీరుస్తావా?" అంది ఇందిర.

"అదేమిటి, కొత్తగా మాట్లాడుతున్నావ్? నీకోసం ఏమైనా, ఎన్నైనా చేస్తాను. ఎప్పుడైనా నీమాట కాదన్నానా? నాకు కావలసింది నీసుఖ సంతోషాలు."

"అవునా...మరి నే చెప్పినట్లు వింటానని ప్రమాణం చెయ్!"

రాజు ఓక్షణం తటపటాయించాడు. ఏమయితే అదే అవుతుందని నిశ్చంకోచంగా ఆమె చేతిలో చెయ్యి వేశాడు.

"నీవు మంజులను వివాహం చేసుకోవాలి!"

"ఇందూ, ఇది చాలా ఘోరం!"

"నేను చేసిన యీ నిర్ణయం నీకు ఘోరంగానే ఉండవచ్చు. కాని, నీ హృదయం నాకు తెలుసు రాజూ! నిరాశా, నిస్పృహాలమధ్య అది నిత్యమూ ఎట్లా నలిగిపోతున్నదో కూడా తెలుసు...నావల్ల నీకు అన్యాయమే జరిగింది; నేను కాదనను.

నీ ఆవేదనచూసి నేనెంతకుమిలి పోతున్నానో నీకెట్లా తెలుస్తుంది?...నా చెల్లెలనే వాత్సల్యంతో మంజులను నిన్ను చేసుకోమనటంలేదు: చీకటికోణాలు వ్యాపించిన నీ జీవితంలో సుఖశాంతులనే వెలుగురేఖలు రావాలి. అదే నాకు కావాలి. అందుకే యీ తాపత్రయం. అప్పుడే నాకు ఆనందం లభిస్తుంది. చెమర్చిన కళ్లను తుడుచుకుంటూ అంది ఇందిర."

ఆమె ఇంతకాలమూ సంతోషంగా ఉంటున్నదనే తెలుసుకొన్నాడు కాని. తనగురించి ఇంత బాధపడుతుందని అసలు భావించనే లేదు.

"ఇదే నా కాంక్షయితే తప్పక చేసుకుంటాను. కాని. మంజుల, తమల్లి కన్నక్రమంగా ఒప్పుకోవాలిగా!"

"బావగారు, చిన్న 'దారి' చూపిస్తే వాళ్ళు అప్పగిస్తారు. నే చెబితే వాళ్ళు కాదనరు. ఇహ మంజుల సంగతంటావా?...అది నిన్ను ప్రేమించింది రాజూ!"

"సరే. నీ యిష్టం! మరి నిన్నెన్నడూ బాధపడనని నాకు మాటియ్యి!" అన్నాడు చెయ్యిముందుకు చాపుతూ.

"ఇంకెందుకు రాజూ బాధ! కథ కామెడీ అయిందిగా" అంటూ ఇందిర అందంగా హాయిగా నవ్వింది. ఆ నవ్వు నిర్మలంగాను, ఎంతో సహజంగాను ఉంది.

తన బ్రతుకులో సుఖమూ, శాంతి చిగురించేందుకు ఆమె చేసే ప్రయత్నమంతా ఇందిరపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది, ఆమె నిస్వార్థజీవి, కరుణామూర్తి, ప్రేమమయి. ఎంతో సహజంగానుఉంది.

రాజు సంతృప్తి చెంది అక్కణ్ణించి హుషారుగా తన గదికి బయలుదేరాడు. గదిలో మంజుల టేబుల్ పైనున్న రాజు ఫొటో వేపుచూస్తూ, ఏమిటేమిటో తలచుకుంటూ ఊహాలోకంలో విహరిస్తోంది.

రాజు చప్పుడు చేయకుండా మెల్లగావొచ్చి ఆమె వెనకనుంచుని భుజంపై చిన్న దెబ్బవేశాడు. మంజుల ఉలిక్కిపడి, వెనుదిరిగి చూసిఅతని హృదయంపై వాలిపోతూ—

"ఎంత మంచివారండీ మీరు!" అంది.

"వలపు తెమ్మెర విసిరి, వరింప జేసుకొన్నది కంటేనా" అంటూ ఆమెను చేతుల్లోకి పొదువుకున్నాడు రాజు.

పక్కింటివాళ్ల రేడియోలోంచి 'ఏనాటి అనుబంధమో యీ జీవులసంబంధం' అంటూ పాడుతున్నారు ఎవరో.

---

[ఈ కథల్లోని పాత్రల పేర్లూ, స్థలాలు, సంఘటనలు కేవలం కల్పితాలు. ఎవరినీ ఉద్దేశించి రాసినవికావు. ఏమాత్రం పోలికలున్నా అవి యాదృచ్ఛికాలే !

—రచయిత.]

# విచలిత

ఆఫీసు గడియారం ఠంగు ఠంగున ఐదు గంటలు కొట్టింది. నీరజ టేబుల్ మీది కాయితాల్ని సొరుగులోకి తోసి, టైప్ మిషన్ను కవరుతో మూసి, కూచున్న స్థలం లోంచి పైకి లేచింది. హేండ్ బేగ్ చేతికి తగిలించుకుని సుశీల దగ్గరకు వెళ్ళింది.

"పని పూర్తయిందిగా, లే పోదాం!" అంది.

పాత రెమింగ్టన్ టైప్ మిషన్ మీద వేళ్ళను వేగంగా కదలిస్తూన్న సుశీల-తల పైకెత్తి ప్రశ్నార్థకంగా నీరజ మొహం లోకి చూసింది.

నీరజ నవ్వుతూ "లే, ఇహ పోదాం!" అంది.

"చూడవలసిన ఉత్తరాలు చాలా వున్నాయి. నేనప్పుడే రాను, నువ్వెళ్ళు!" అంటూ తిరిగి టైపు చేయటంలో నిమగ్నమైంది సుశీల.

"సుశీ! పొద్దుట నాతో ఏం చెప్పావో జ్ఞాపకముందా?"

"ఏం చెప్పాను!" అంది ఆలోచించేందుకు ప్రయత్నిస్తూ.

"సాయంకాలం పని త్వరగా ముగించుకుని పిక్చరుకి పోదామని చెప్పలేదూ!"

"పిక్చర్ కా?"

"ఏమిటే మరీ అంత పరధ్యానం? శాంతీలో మంచి ఫిలిమ్ ఆడుతోంది వెళ్దామని నువ్వేకదుటే అన్నావ్! ఇంతలోనే అంతా మరచావా?" చిరాకును వ్యక్తపరుస్తూ అంది నీరజ.

"ఓహో! ఐ యామ్ సారీ నీరజా!... ఈపూటకి రాలేను. మరోసారి ఎప్పుడేనా పోదాం!"

ఆమె మాటలు విన్నాక నీరజలోని ఉత్సాహమంతా ఒక్కసారిగా అణగి పోయింది.

"అదేమిటే అలా అంటావ్! పొద్దుట్నుంచి మనసు పెట్టుకున్నాను ఆ సినిమా మీద. ఇప్పుడు కాదంటే ఎలా?"

"చూస్తున్నావుగా నా ముందు ఎన్ని ఉత్తరాలు ఉన్నాయో? నువ్వు ఒక్కర్తివీ వెళ్ళు యీసారికి!" అంది శాంతతను గుర్తుకు తెచ్చుకుంటూ సుశీల.

"ఒక్కర్తినే ఎలా వెళ్ళనే?"

"నీరూ! నువ్వు మంచిదానివి కదూ?...మారాం చెయ్యకే వెళ్ళు!" అన్నది సుశీల ఆమెను అనునయిస్తూ.

దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచి అక్కణ్ణుంచి కదిలి వీధిలోకి అడుగు పెట్టింది నీరజ.

# 2

సుశీల నీరజలు ఒకే ఆఫీసులో పని చేస్తున్నారు. ఇద్దరూ టైపిస్టులే! సుశీల ఉద్యోగంలో చేరి అంతా పదిహేనురోజులయింది. వాళ్ళ పరిచయం జరిగి కొద్ది దినాలే అయినా, ఆ యిద్దరి మధ్యా అమితమైన అన్యోన్యత ఏర్పడింది.

పొద్దుట సినిమా ప్రస్తావన వచ్చి, సాయంత్రం తప్పకుండా వెళదామన్నది సుశీల. ఇప్పుడు అమ రానంటే నీరజ మనసంతా నీరసమయిపోయింది. ఒక్కర్తీ వెళ్ళేందుకు బుద్ధిపుట్టలేదు. అందుకని తన ఫ్రెండ్ కల్యాణిని తోడు తీసుకుని బయలుదేరింది సినిమాకి.

హాలు దగ్గరికి చేరుకునేసరికి ఆట యింకా మొదలు పెట్టలేదు. టిక్కెట్లు తీస్తున్నారు. నీరజ రెండున్నర టిక్కెట్లు రెండు తీసుకుని లోపలికి అడుగు పెట్టింది కల్యాణితో సహా.

హాల్లో లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఇద్దరూ చెరో సీట్లోనూ కూచున్నారు.

"సుశీల ఏమందే నీరజా?" అంది కల్యాణి.

"ఆఫీసులో వర్క్ ఎక్కువగా ఉండటంచేత రానన్నది."

"అదుగో ఆ మొదటి వరుసలో కూర్చున్నదెవరో చూడు!" అంటూ చూపించింది నీరజకు.

"ఆఁ!"

"ఎవరు?"

"సుశీలే!"

"సరిగ్గా చూసి చెప్పు!"

సరిగ్గా చూసేదేమిటే నీ మొహం! కళ్ళను స్పష్టంగా కనిపిస్తుంటేను!"

"అదికాదే! దానిలో మార్పొస్తున్న 'అందాన్ని' చూశావా అని!"

వాడియైన తన కళ్ళనోమారు అటువైపుకి చురుగ్గా తిప్పింది నీరజ.

మొదటి వరుసలో సుశీల. ఒక యువకుడితో మాట్లాడుతూ మధ్య మధ్య నవ్వుతోంది అందంగా. కాదు...కాదు ఆ నవ్వు ఆ మోహవిధమైన అందాన్ని చేకూరుస్తోంది. ఆ దృశ్యం చూసి నీరజకు ఉద్రేకమూ, ఉక్రోషమూ కలిగినయ్.

"ఆ! ఎంతఘోరం!" అని అప్రయత్నంగా.

"ఏమిటి?" కల్యాణి ప్రశ్నించింది.

"సుశీ ఇంత అన్యాయాని కొడిగడుతుందని నేనెన్నడూ అనుకోలేదు కల్యాణీ!... అది ఆఫీసులో చేరి అంతా పదిహేను రోజులైందో లేదోగాని, అప్పుడే నా శంకరాన్ని బుట్టలో వేసుకుంది. సినిమాకి రానన్నది అందుకేనన్న మాట" అంది నీరజ.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరగసాగినయ్. ఇహ అక్కడ వుండలేక పోయింది. కుర్చీలోంచి లేచింది.

# 3

సుశీల ఇంత మోసం చేస్తుందని తనెన్నడూ అనుకోలేదు; కనీసం ఊహించలేదు. తనకు అత్యంత సన్నిహితంగా మెలుగుతూ యింత ఘాతుకం తలపెడుతుందని అసలు తనెలా అనుకుంటుంది? ......అనుకునేందుకు అవకాశమెక్కడుంది?... మనసారా వలచిన తన శంకర్‌ని బుట్టలో వేసుకుంటుందా? సుశి తనకి స్నేహితురాలుగా కాక, పక్కలో బల్లెంలా తయారయింది.

మన బంగారం మంచిదైతే అసలు ఇంకొకర్ని అనవలసిన పనేముంది?... శంకర్ తీయని మాటలువిని మోసపోయింది తను...సర్వమూ 'అతనే'గా భావించుకుని మురిసిపోయింది. తననెలా మురిపించేశాడుకూడా. 'మన రెండు హృదయాలు ఒకే వృత్తంలో బంధించబడ్డాయి. మన ప్రేమ పవిత్రమైనది నీరూ!' అన్నాడు తననానాడు దగ్గరికిలాక్కుంటూ మరీనాడు అతను చేసిందేమిటి? ఆడవాళ్ళ జీవితాలతో చెలగాటమాడటం కొందరి మగాళ్ళకి సరదా కాబోలు!... శంకర్‌ని యీసారి రానీ చెప్తా! అనుకుంది నీరజ.

ఆరోజు ఆదివారం కావటంవల్ల నీరజ ఇంట్లోనే ఉంది. గతరాత్రి చూసిన సంఘటన ఆమెను బాధిస్తున్నది. ఏపని చేద్దామన్నా మనసు పుట్టటంలేదు.

"నీరూ! నీరూ" అంటూ లోపలికొచ్చింది సుశీల.

నీరజ ఆమె పిలుపు విని - విననట్టుగా పుస్తకం ఒకటి చేతిలోకి తీసుకుని చూస్తూ కూచుంది.

సుశీల దగ్గిరకొచ్చి "నీరూ!" అని మళ్ళీ పిలిచింది. ఐనా నీరజ పలుక లేదు; ఉలక లేదు.

"ఏమిటే ఎంత పిలిచినా పలకవ్! నా మీద కోపం వొచ్చిందా?"

"నాకెందుకూ కోపం? ...అయినా ఎవరిమీద కోప గిస్తే ఎవరూరుకుంటారు?"

"నిన్న సినిమాకి రాలేదని నా మీద కాస్త కోపొచ్చి ఉండాలే మరి?" అంటూ సన్నగా నవ్వింది సుశీల.

"ఎవరిష్టమొచ్చినట్టు వాళ్ళు పోతారు. ఒకరొకరు అడిగేందుకు హక్కేముంది?"

"అదేమిటేవ్! ఇవాళ అదో రకంగా మాట్లాడు తున్నావ్! ఏదీ ఇటు చూడు!" అంటూ నీరజ ముఖాన్ని తన వేపుకు లాక్కుంది సుశీల.

"సుశీ! దయచేసి నన్ను మాట్లాడించకు. కాస్సేపు ఒంటరిగా ఉండనీ!" అంది బాధగా నీరజ.

"అసలు నీ మనస్సులో ఏదో ఉంది. అది నాకు చెప్పేంతవరకూ ఇక్కణ్ణించి కదలను!"

"మనసులో కల్మషం పెట్టుకుని, పైకి మంచిదానిలా నటించడం నాకు చేతకాదు" అన్నది నీరజ ఉక్రోషంగా.

"ఐతే ఇంతకీ నువ్వనేదేమిటే!"

"ఏమీలేదు...దయచేసి నన్నిక్కడ్నించి వెళ్ళమని కోరుతున్నాను."

"నారాక నీకింత కష్టం కలిగిస్తుందని తెలిస్తే అసలు వొచ్చేదాన్నే కాదు. సరే...వెళుతున్నా" అంటూ బరువుగా అడుగులు వేస్తూ బయటికి సాగింది.

వెళ్తోన్న సుశీలను చూసి ఏడుపొచ్చింది నీరజకి. కనుగుడ్ల నిండుగావున్న నీరు బయటికి రాకుండా ప్రయత్నపూర్వకంగాను, కింది పెదవిని పైపంటితో గట్టిగా నొక్కిపట్టింది,

మధ్యాహ్నం మూడుగంటలు దాటింది.

శేఖర్ సన్నగా ఏదో పాడుకుంటూ నీరజవున్న గదిలోకి వొచ్చాడు. అతన్ని గమనించనట్టు మొహాన్ని గోడవేపు తిప్పుకున్నది నీరజ.

"నీరజా!" పిలిచాడు.

"..............."

"అబ్బో! యివాళ రాణీగారికి ఏదో కోపం వొచ్చినట్టుందే?" అన్నాడు కనుబొమలు పైకెగురవేస్తూ.

"కోపంలేదు; మీమీద తాపమూ లేదు. దయచేసి ఇక్కడ్నించి వెళ్ళండి. నేపడుకోవాలి!"

"ఏమిటి నీరజా అసలేం జరిగింది?"

"జరగవలసిందేదో నాకు జరిగింది. మళ్ళీ మీ కెందుకు?"

"అంతే సంగతేనా?"

"కాక ?...ప్లీజ్ ! వెళ్ళండి."

"కారణంలేని నీకోపంలో ఏం మాట్లాడుతున్నావో కూడా తెలీటంలేదు. సరే, వొస్తా. గుడ్ నైట్!" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు శంకర్.

చటుక్కున మంచంమీంచి లేచి 'శంకర్' అని పిలుద్దామనుకుంది. మనసువిప్పి అతనితో ఎన్నో చెప్తామనుకుంది. అంతలో అభిమానం అడ్డొచ్చి-రాత్రి సంఘటన కళ్ళముందు మెదిలింది. 'వెళితే వెళ్ళనీ, తనకేం భయమా ?' అనుకుంది.

# 4

నీరజ ఆఫీసులోకి అడుగుపెట్టే సరికి హెడ్ క్లర్క్-సీతారామయ్య ఏమిటో గొణుక్కుంటున్నాడు. ఆయన్ని చూసి సన్నగా, చిన్నగా నవ్వింది నీరజ.

ఆమె అంటే సీతారామయ్యకి అమితమైన అభిమానం. ఆమె యోగక్షేమాలు విచారించే ముఖ్యుల్లో ఆయనొకడు. సీతారామయ్య పట్ల కూడా ఆమెకి అలాంటి గౌరవాదరాలు ఉన్నాయి.

"ఏమిటో చిరాకుగా ఉన్నట్టున్నారే ?" అడిగింది నీరజ.

"రామ్మా, రా!... ఏముంది ? మన ఆఫీసులో ఓ పోస్టు ఖాళీ వొచ్చింది, దానికి మా మేనల్లుడు భాస్కరం

అప్లికేషను వేశాడు. ఇంటర్వ్యూలో సెలక్టయ్యాడుకూడా. ఇరవయ్యో తేదీనవచ్చి ఉద్యోగంలో జాయిన్ వ్వమన్నారు!''

''గుడ్, శుభవార్త! మరి సంతోషించవలసింది పోయి...''

''చెప్పేది పూర్తిగా విను తల్లీ! ఆ ఉద్యోగం వాడి కివ్వలేదు, ఆ స్థానంలో వేరొకరు నియోగించబడ్డారు.''

''అదేమిటి? చాలా దారుణం! మరి మీరు ప్రొప్రయిటరుగార్ని కలుసుకుని గట్టిగా అడగలేదూ?''

''అడిగిమటుకు ప్రయోజన మేముందమ్మా! ఆ సీట్లో కూచున్నది ఆయన తమ్ముని కొడుకు. మొన్ననుకూడా ఓ సీటు ఖాళీ వొచ్చింది. పోనీ అదైనా వొస్తుందేమో అనుకున్నాను...కానీ అదికూడా భర్తీ అయిపోయింది.''

''ఆ ఉద్యోగం ఎవరికిచ్చారు?''

''మన సుశీలకు!''

''ప్రొప్రయిటర్ గారికి మీ మీద ద్వేషమా? ముందుగా సెలక్టయిన భాస్కరంగారి కివ్వకుండా సుశీల కెలా యిచ్చారు?''

నీరజలో కోపం పెరుగుతూంది.

''లేదమ్మా, ఆయన చాలామంచివాడు. కాని, తప్పని సరి పరిస్థితుల్లో యివ్వాల్సివొచ్చింది. సుశీల ప్రొప్రయిటర్ గారి కుమార్తె. చదువు పూర్తయిందిగా! ఇంట్లో ఒక్కర్తికీ తోచక, చేసే పనేమీ లేక యీ ఉద్యోగంలో చేరింది.''

'సు......శి...... ప్రొప్రయిటర్ గారమ్మాయా? యీ విషయం తనకెన్నడూ చెప్పలేదేం?'

"ఐతే అయన తమ్ముని కొడుకు?"

"శంకర్!..." అంటూ సీతారామయ్య ఇంకా ఏదో చెప్పబోతున్నాడు,

నీరజ మనసు ఆనందోద్వేగాలతో నిండిపోయింది. ఇక ఒక్కక్షణంకూడా అక్కడ నిలువలేక పోయింది. హెడ్ క్లర్కు చెప్పేమాటలు వినిపించుకోకుండా విన్నగా సుశీల టేబుల్ దగ్గరికి వెళ్ళింది. కాని, ఆమె అక్కడ లేదు.

సుశీలపట్ల తను కేర్పరచిన దురభిప్రాయానికి క్షమాపణ కోరుకోవాలని నీరజ తహతహ లాడుతున్నది. ప్రస్తుతపరిస్థితుల్లో సుశీల ఎక్కడున్నా చూడాలని ఆమె మనసు ఆరాట పడుతూంది.

హెడ్ క్లర్కు నడిగి ప్రొప్రయిటరుగారి యింటి అడ్రసు తీసుకుంది. లీవు లెటరు వ్రాసిచ్చి బయలుదేరింది. తీరా యజమానిగారియిల్లు చేరుకున్నాక ఆమెలో అనేక సందేహాలు ఉదయించాయి.

'ఇప్పుడు సుశిని ఏమని సంభోదించాలి? ప్రస్తావన ఏవిధంగా ప్రారంభించాలి?... నిన్న తను చూపిన నిర్లక్ష్యానికి, మాట్లాడిన తీరుకు ఎంతగా బాధపడిందో ఏమో? అనాలోచితంగా, ఆవేశంలో సుశిని ఎంతెంతమాటల నేసిందితను? అనుచితమైన తన ప్రవర్తనను-క్షమించగలదా ఆమె? అవ

మానించి తనను పంపివేస్తే...' యీ సందేహం వొచ్చేసరికి ఆమె వొళ్ళు ఝల్లుమంది. తనను పట్టుకుని ఎవరో బలవంతంగా దూరంగా విసిరేస్తున్నట్లనిపిస్తూంది. 'చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ' అని, త్వరపడి విషయ నిర్ణయం గావించుకుంటే-ఏర్పడే అనర్థకాలు ఇప్పుడిప్పుడే తెలిసివస్తున్నవి. అందుకే దూరాలోచన లేందే ఏపనీ చెయ్యకన్నారు పెద్దలు.

సంశయిస్తూనే బంగళా లోపలికి ప్రవేశించింది నీరజ. ఆ యింట్లోని హాల్లో ఆమె కెవరూ కనిపించలేదు, అక్కడే నుంచుని నెమ్మదిగా "సుశీలగారూ!" అంది.

ఎవరూ పలుకలేదు!

"సుశీలగారూ!" మళ్ళా పిలిచింది.

"ఎవరూ?" అంటూ యింట్లోంచి వొచ్చింది సుశీల.

నీరజ రాకచూసి ఆమె ఆశ్చర్యచకితమైంది.

"నిన్నటి నా ప్రవర్తనను క్షమించండి సుశీలగారూ! నిజానిజాలు తెలుసుకోకుండా, మీ అంతస్థు, హోదా తెలియకుండా అవమానించి పంపాను. వివేకాన్ని విస్మరించి వర్తించాను... యీ అభాగ్యురాల్ని మన్నించగలరా?" అంది నీరజ – తలొంచుకుని.

"అదేమిటి నీరూ! బహువచనంలో సంబోధిస్తున్నావ్? నా అంతస్థు నీకివాళ తెలిసినంతమాత్రాన నన్ను అధికురాలిగా ఎంచి మాట్లాడుతావా? — యిన్నాళ్ళ మన

స్నేహం ఎక్కడికిపోతుంది?...తప్పుకదూ...నీవు నా వొది నవి నీరూ!"

సుశీల హృదయ సౌందర్యమంతా ఆ క్షణాన కని పించింది నీరజకి. స్నిగ్ధమంజుల వాత్సల్యంతో 'సుశీ' అని గట్టిగా కౌగలించుకుంది ఆమె.

నీరజలో సంతోషం ఉప్పెనలా పొంగింది. తలెత్తి నెమ్మదిగా సుశీలవేపు చూసింది.

స్నేహవల్లరిలోని అనుబంధం పటిష్టమైనప్పుడు అది మేలిమి బంగారంవలె భాసిల్లుతుంది. ఆ పవిత్రస్నేహంలో ఎంత ఆనందం! ఎంత రమణీయ మనోజ్ఞత!! కోరుకున్నా అందరికీ అందని అదృష్టమది!

"భగవంతుడు నీకెలాంటి విశాలహృదయం ఇచ్చాడు సుశీ" అంది నీరజ. అలా అన్నప్పుడు ఆమె వెచ్చని కన్నీటి బొట్లు సుశీల మెడను తడుపుతున్నాయి.

"నీరూ! ఏడుస్తున్నావా? ఛా! ... తెప్పుకదూ!" అంది సుశీల ఆమె మొహాన్ని తనవైపు తిప్పుకుని - కన్నీళ్ళను సున్నితమైన తన మునివ్రేళ్ళతో తుడుస్తూ.

"ఏడుపుకాదు సుశీ..."

"ఊ...ఊ!...నువ్వు చెప్పబోయే దేమిటో నాకు తెలుసులే! ఆనందభాష్పాలని...అంతేగా! ఉండు, అన్న య్యని రానీ చెబుతా" సుశీల అంటూండగా శంకర్ వచ్చా డక్కడికి,

అతన్ని చూసి సిగ్గుతో తలొంచుకుంది నీరజ.

"అన్నయ్యతో చెబుతానంటున్నా వేమిటి సుశీ!"

"నాకేం తెలీదు బాబూ!...ఆ పేషెంటు సంగతి యీ డాక్టరుగారు చూడాల్సిందే. నాకెందుకూ మర్యాద! నే పోతున్నా!" అంటూ లోపలికి పారిపోయింది సుశీల.

"సుశీ" పిలుస్తూ అడుగు ముందుకే వెయ్యబోయింది నీరజ. ఆమె దారికడ్డంగా వొచ్చాడు శంకర్.

"శంకర్! నన్ను క్షమించగలరా?"

"అది తర్వాత ఆలోచిస్తాంగాని, ముందు నామీద కోపం పోయిందో లేదో చెప్పండి హృదయరాణిగారూ!" అన్నాడు చమత్కారంగా.

సీరియస్‌లో కూడా స్పోర్టివ్‌గా మాట్లాడే జీనియస్ అనుకుంది.

"మీరు రేపట్నుంచి ఉద్యోగం మానెయ్యాలి!" అన్నాడు శంకర్.

"ఏం, అదేం?" అంది అమాయకంగా నీరజ.

"ఏమో నాకు తెలీదు. సుశీ 'సిఫార్సు' అది"

"ఆ సిఫారుసుకి ఇంకో చిన్న సిఫార్సు జాయింటు"

"ఏమిటది? ... కోపమొచ్చి నన్ను ఉద్యోగం మానెయ్యమని కాదుగదా?"

"అది కాదండీ!"

"మరేమిటండీ?" ఆమె కన్నుల్లోకి చిలిపిగా చూస్తూ అన్నాడు.

"మరి... మన ఆఫీసులో హెడ్ క్లర్కు సీతా రామయ్యగారు లేరూ?... ఆయన మేనల్లుడికి రావలసిన ఉద్యోగంలో మీరు చేరారు. పాపం! ఆయనెంత బాధపడు తున్నారో యీ విషయం గురించి...నేనెలాగూ మానేస్తు న్నాగా!...నా స్థానైనా అతని కివ్వమని మీ బాబాయిగారికి కాస్త 'సిఫారుసు' చేయండి.

"నీకు మామగారవుతారుగా, నువ్వే చెప్పు! కాబోయే కోడలివి గనుక నీ మాటకే విలువ ఎక్కువుంటుంది!"

"అమ్మో, ఆయనతో మాట్లాడటమే!... అసలు ఆయన్ని చూస్తేనే నాకు భయం వేస్తుంది!" అంది సిరజ గుండెలమీద చేతులు వేసుకుని.

"ఏమిటోయ్!" అంటూ అక్కడికి సోమశేఖరం గారు వొచ్చారు.

ఆయన్ని చూడగానే సిరజకి గుండె ఆగినంత పని యింది. శరీరం కొద్దిగా వొణకటం మొదలుపెట్టింది.

"అ ... బ్బె ... ఏమీ లేదండీ, ఆ కాయితాలు ఇంకొంచెం సేపట్లో టైపు..."

"...ఇంకా టైపూ, కాయితాలూ ఏమిటమ్మా! ఉన్నమతి చెడలేదు కదా? ఇకనుంచి ఈ యింటికోడలివి!"

సోమశేఖరంగారి మాటలు విన్నాక ఆమెకి ఆనందమూ, ఆశ్చర్యమూ ఒక్కసారే కలిగాయి. ఆయన నీ పెళ్ళికి యింత సులభంగా సమ్మతిస్తారనుకోకపోవటమే అందుకు కారణం.

కంగారును నిభాయించుకుంటూ, "మా అంతస్థుకు..."

"...సరితూగగలవో, లేదో నాకు తెలుసు. అందుకే నిన్ను శంకర్ కిచ్చి చెయ్యాలని నిశ్చయించుకున్నాను. గుణం ప్రధానంగాని అంతస్థు, హోదా, కులగోత్రాలు కాదు. బోధపడిందా?"

ఆయన హృదయ సౌజన్యానికి మనసులోనే వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంది. వినయపూర్వకంగా వంగి ఆయన పాదాలకు నమస్కరించింది.

సోమశేఖరంగారు ఆశీర్వదిస్తూ పైకి లేవనెత్తి, ఆమె చేతిని శంకర్ చేతిలో పెడుతూ "చూస్తావేమోయ్, పట్టుకో" అంటూ నవ్వుతూ అక్కణ్ణించి మెల్లగా లోపలకు జారుకున్నారు.

శంకర్ ఆమెను దగ్గరికి తీసుకొంటూ "బాబాయి ఎంత మంచివాడో తెలుసా నీకూ!" అన్నాడు.

నీరజ వదనం ప్రఫుల్లమయింది.

"ఔను శంకర్! అంత గంభీరస్వరూపంలో ఎంత దయార్ద్రహృదయం వుందో కూడా ఇప్పుడే చూడగలిగాను" అంది అతని గుండెలపై తలవాల్చుతూ.

"మే ఐ కమ్ ప్లీజ్!"

నీరజ చప్పున శంకర్ నుంచి తప్పుకుంది. ఎవరోనని అటు తిరిగింది.

"హాట్ కాఫీ వదినా, కోప్పడకు!" అంటూ సుశీల ట్రేతో వచ్చింది.

"అబ్బ ఛో సుశీ! ఎవరో అనుకుని హడిలిచచ్చాను" అంటూ మొహం పక్కకి తిప్పుకుని తీయగా నవ్వుకుంది— నిర్మల సరోవరంలోని తెల్లకలువలాంటి నీరజ.

---

అనుబంధం

# స్త్రీ వంటయింటి బానిసకాదు!

కుమారి కె. రామతులసి.

వివాహ సమయంలో వధూవరులతో విధిగా కొన్ని మాటలు అనిపిస్తారు పెద్దలు! అవి యివి: 'మేమిద్దరం ఒకరి నొకరు అనురాగంతో చూసుకుంటూ - జీవితాన్ని ఆనందంగా గడుపుతూ - సుఖాలను ఎలాగైతే కలిసి స్వీకరిస్తామో, కష్టాల్ని కూడా అలాగే మేము చిరునవ్వుతో ఎదుర్కొంటాం.'

పెళ్ళి అయిన దగ్గిరనుంచి యువతి తనకు భర్తగా లభ్యమైన వ్యక్తిని అమితంగా ప్రేమిస్తుంది. ఆయన్ను దైవంగా ఆరాధిస్తుంది; ఆయన అడుగులకు మడుగులొత్తుతుంది: ఆయన సుఖసౌఖ్యాలే తన శాంతి సౌభాగ్యాలనుకుంటుంది; ఆయనజీవితంలో వెలుగును చూస్తోంది, చీకటిని పోగొట్టేందుకు తన శాయశక్తులా కృషి చేస్తుంది. భర్త అభీష్టమే తన ఇష్టంగా భావిస్తుంది.

మరి పురుషుడో!

అలాకాదు. పెళ్ళయిన మొదటి మూడు మాసాలు ఆయన ముచ్చటగా పెళ్ళాన్ని అనురాగంతో చూస్తాడు. కొత్త మోజులో భార్య కోరినవన్నీ తెస్తాడు. ఇక అక్కడ నుంచి అగపడుతుంది అయ్యగారి అసలు స్వరూపం! మొదట్లో ఆయన తియ్యని మాటలు చెప్పి-ఆమెను లొంగదీసుకుంటాడు. లొంగిపోయింది కాబట్టి ఆమెను చూస్తే ఆ భర్తకు లోకువ!

లొంగకుండా ఉన్నంతసేపు ఆమె అతనికి ఆరాధ్య దేవత! తీరా ఆమె తనవశమయ్యాక ఆయనకు ఆమెమీద రకరకాల అభిప్రాయాలు యేర్పడతాయి. స్త్రీ తన కోర్కెల్ని తీర్చే యంత్రం లాంటిదని, ఆమెకు సొంత అభిప్రాయా లంటూ ఉండకూడదని, గడపదాటి యువతలకు రాకూడదని, తనెక్క డికయినా వెళ్ళి ఏ వెధవ పోకిళ్ళు పోయినా అడిగే అధి కారం ఆమెకు లేదని, తన ఆజ్ఞ నామె అనుచరాలా శిరసా వహించాలని, ఆమెకు కోరిక ల్లాంటివేమీ ఉండకూడదని- యిలా రకరకాల భావాలు అతనిలో ఉత్పన్నమవుతాయి.

పాపం-అమాయకురాలైన స్త్రీకి, భర్త మనసులో ఉన్న యీ కుట్రలన్నీ యేమీ తెలియవు. మొదట ఆయన తనపై చూపిన అనురాగాన్ని నిజమైన ప్రేమ అనుకొని-అది జీవితాంతంవరకు అలాగే ఉంటుందని ఆమె భ్రమిస్తుంది. మగని ప్రాపుకింద తన బ్రతుకు ఆమె మూడు పువ్వులు, ఆరు కాయలుగా వెలిగిపోతుందనుకుంటుంది. ఊహా ప్రపం చంలో సంచరిస్తూ ఆమె ఆనందానికి సంబంధించిన ఏవేవో కలలు కంటుంది.

సంతానోత్పత్తి ప్రారంభం కాగానే ఆ భర్తలో చిరా కుకు, ఆమెపై ఏవగింపుకు, నాందీ ప్రస్థావన జరుగుతుంది. భర్త కలయిక ఫలితంగా తన కడుపులో పెరుగుతున్న శిశు వును నవమాసాలుమోసి, అష్టకష్టాలుపడి కంటున్న ఆమెపై ఆయనకు ప్రేమ, జాలి - అలాంటివేమీ కలగవు. ఆ సమ

యంలో భర్త చిరునవ్వుకోసం-ప్రేమతో పలకరించే తియ్యని పిలుపుకోసం - ఎదురుచూస్తూ ఉంటుంది ఆ మాతృమూర్తి హృదయం.

పురుషుడు చంచల స్వభావుడు! అతడు ఏం చేసినా చెల్లుతుంది! ఏమైనా చెయ్యగలడు! చేస్తాడుకూడా! పెళ్ళినాడు భార్యతో చేసిన ప్రమాణాలన్నీ మరిచిపోయి ఆయన కొత్తజీవితం ప్రారంభిస్తాడు. భారత దేశంలో పుట్టిన ప్రతి స్త్రీ పవిత్రమైన తన వైవాహిక సూత్రాలను మరచిపోలేదు. మన దేశంలోని ప్రతి స్త్రీ ఒక మహత్తరశక్తి! ప్రతివ్రతామ తల్లి! ఈ విషయాన్ని చరిత్రకూడా స్పష్టపరుస్తోంది. భారత దేశ ఔన్నత్యానికి స్త్రీ మూలాధారం. ఏ చరిత్ర తిరగవేసినా ఆనాడు స్త్రీకున్న ప్రాధాన్యం, స్వాతంత్ర్యం, యీనాడు సంఘంలో లభించడం లేదు. నేను స్త్రీననే స్వాభిమానంతో యిలా వ్రాస్తున్నానని మీరు అనుకోకండి! వర్తమాన కాలంలో ఆడవాళ్ళకు చాల అన్యాయాలు జరుగుతున్నాయి. వాటిని ఎదుర్కొని, పురుషునివద్దనుంచి తనకు సంక్రమించవలసిన హక్కులకోసం, ఆత్మజీవిత వికాసంకోసం ప్రతి స్త్రీ పోరాడవలసిన సమయం ఆసన్నమయింది. ఈ పోరాట ఫలితంగా ఆమె జీవితం సుఖప్రదం అవడానికి అవకాశం లభిస్తుంది.

నాకు తెలిసిన ఒక కుటుంబాన్నిగురించి నేనిక్కడ కొన్నిమాటల్ని చెప్పకుండా ఉండలేకపోతున్నా.

ఆయ నొక ఆఫీసరు (పేరు వెల్లడిచేస్తే బాగుండదు.) ఆయనకు నెలకు రెండువందల రూపాయలదాకా జీతం వస్తుంది. ఆయన పరమ లోభి. ఆఫీసరు నన్నే అహం ఆయనలో బాగా గూడు కట్టుకుంది. ఆయన భార్య చాలా మంచి మనిషి. చదువుకున్నది; సభ్యత, సంస్కారాలు ఉన్నది. వారికి ముగ్గురు పిల్లలు. పనిమనిషి ఉంటే డబ్బు ఖర్చని మానిపించాడాయన. అందుచేత యింటిపని అంతా ఆవిడే చేసుకోవాలి. పాపమా యిల్లాలు పొద్దున్నే నాలుగింటికి లేస్తుంది; చక్కగా అంట్లన్నీ తోముకుంటుంది. పాచిపనులు పూర్తిచేసుకొని వంటింట్లో పడుతుంది - టిఫిన్, కాఫీలు తయారు చేసేందుకు!

ఆ ఆఫీసరుగారికి భార్య పట్ల ఒకే ఒకవిధమైన అభిప్రాయం ఉంది. తన జీవితాన్ని ఆనందమయం చేయడానికే ఆమె పుట్టిందన్నదే ఆ అభిప్రాయం. తన భోజన సదుపాయాలను ఆవిడ వేళ ప్రకారం చూడాలి. ఆమె గడపదాటి యింటిబయటికి పోగూడదు. తన స్వార్థం కోసం ఆవిడ తన ఆత్మను అర్పణ చేయాలి.

ఉదయం నిద్రలేచిన దగ్గిరనుంచీ ఆయన 'కాఫీ-కాఫీ' అంటూ ఒకటే కేకలు వేస్తాడు. కాఫీ అందించే వరకు ఆమెకు ఊపిరి సలప నివ్వడు. ఆవిడ హడావిడిగా పాలు పొయ్యిమీద పెట్టి, డికాక్షన్ తీసి, ఖంగారుగా కాఫీ చేసి యిస్తుంది-ఆయనకు ఎక్కడ ఆలస్యమై పోతుందోననే భయంతో!

వచ్చినందుకే ఆయన యింత బాధ పడుతున్నాడే - మరి అక్కడ వంటగదిలో పొయ్యిని మండించేందుకు ఆవిడ ఎంత అవస్థ పడుతుందో ఎవరయినా ఊహించుకోవలసిందే!

ఈ మగాళ్ళందరికీనూ ఒకటే అభిప్రాయం ఉంది. అది: 'మేమెంతో కష్టపడి పనిచేసి డబ్బు సంపాయించి తెస్తున్నాం వండి వేళకింత పెట్టడానికి ఆడదానికి ఏం బాధ' అని!... బయట పురుషుడెంత పనిచేస్తున్నాడో యింట్లో స్త్రీ, అతనికి అన్ని సదుపాయాలు కలిగించడానికి అంత పని చేస్తోంది. అంటే కుటుంబ జీవితాన్ని నడిపించడంలో స్త్రీ కూడా పురుషుడితో పాటు సమానంగా శ్రమిస్తున్నదన్నమాట! మరి యింక మగవాడిలోని ప్రత్యేకత ఏమిటి? సరిగ్గా తొమ్మిన్న తొమ్మిదీ పదిహేను నిమిషాలకు భర్తకు భోజనం పెట్టి సాగనంపే వరకు ఆమెకు ప్రాణ సంకటంగానే ఉంటుంది. ఆ తరువాత ఆమె పిల్లలకు భోజనం పెట్టి స్కూలుకు పంపిస్తుంది. అప్పటికామెకు కాస్త 'రిలీఫ్' దొరుకుతుంది. వాళ్ళంతా వెళ్ళాక తాను కూడా నాలుగు మెతుకులు తిని, మంచం మీద కాసేపు నడుం వాలుస్తుంది!

నాలుగయ్యేసరికి మళ్ళీ మామూలు వంట ప్రయత్నాల్లో ప్రవేశిస్తుంది. ఈలోగా పిల్లలు స్కూలు నుంచి వచ్చేస్తారు. ఇంట్లోనూ - ఆవిడ ఒంట్లోనూ కూడా హడావిడి బయలుదేరుతుంది.

ఒక రోజున వారింట్లో అనుకోని సంఘటన జరిగింది.

'అవును-నాకు సంక్రమించవలసిన హక్కు-లకోసం పోరాడడంలో నా తప్పేమీ లేదనుకుంటా. స్వాతంత్ర్య జీవితాన్ని గడుపుతా. నా జీవితంలో యింతవరకూ లేని శాంతి, సౌఖ్యాలను సమకూర్చుకుంటా', అంది కవిత.

'ఊహూఁ!...సరే-నీ యిష్టం వచ్చినట్లు చేసుకో!... పిల్లల్నికూడా తీసుకు వెళ్ళు!...'

'భరించేవారు కాబట్టి భర్త అన్నారు! మన యిద్దరి కలయిక ఫలితంగా ఉద్భవించారు పిల్లలు. మీ జీవితాంతం వరకు నన్ను పోషించవలసిన బాధ్యత మీ పై ఉంది. నేను యికమీదట మీ పోషణలో ఉండను కాబట్టి నా బదులు పిల్లల్ని పోషించండి! కన్నతల్లినవడంచేత పిల్లల పైన - నేను సంపాదించేదాంట్లోనుంచి - ప్రతినెల కొంత మొత్తం పంపుతుంటాను' అన్నదామె.

ఆ తరువాత వాళ్ళిద్దరు విడిపోయారు. ఆరుమాసాలు గడిచాయి. ఆరోజు ఆదివారం, ఉదయం పదకొండు గంటలయి ఉంటుంది. రేడియో సిలన్‌లో వస్తున్న పాటల్ని వింటూ నేను పడకకుర్చీమీద కూర్చున్నా. ఇంతలో మా చిన్నతమ్ముడు గోపీ వచ్చి 'అక్కా--నీకోసం ఎవరో వచ్చారు' అన్నాడు. వీధిలోకి వెళ్ళి చూశాను. ఆవిడ ఆఫీసరుగారి భార్య. ఆప్యాయంగా నేను లోనికి ఆహ్వానించాను. ఆవిడ నా సరసనే ఉన్న మరో కుర్చీలో కూచుంటూ అన్నది.

'తులసీ-మనం కలుసుకోని చాలా కాలమైంది కదూ నేనిప్పుడు బ్లింక్‌స్టన్ అండ్ కో లో పనిచేస్తున్నాను. నూట

యాభై రూపాయలు జీతం యిస్తున్నారు. జీవితం ఎంతో హాయిగా ఉంది. ఏ బాధ లేదు. స్వతంత్ర జీవనాన్ని అలవరచుకున్నా.' ఆవిడ నాతో యింకా యింకా చాలా చెప్పింది. దానితో పాటు ఆశ్చర్యం కూడా కలిగింది. ఎందుకంటే ఒక స్త్రీ చెయ్యరాని సాహసం చేసి విజయాన్ని సాధించింది. ఇలా జరగకూడదు' అని సంఘం వ్రాసిపెట్టిన శాసనాన్ని చెరిపి పారేసి 'ఎందుకు జరగదు' అని ఆవిడ నిరూపించింది. మేమే గొప్పవాళ్ళమంటూ విఱ్ఱవీగుతున్న మగవాళ్ళకు ఆవిడ విజ్ఞాన చక్షువును ప్రసాదించింది.

ఆమెలాగే ప్రతి స్త్రీ స్వతంత్ర జీవనాన్ని అలవరచుకోవాలి. పురుషులనుంచి తమకు న్యాయానుగుణ్యంగా సంక్రమించవలసిన హక్కులకోసం స్త్రీలుపోరాడాలి. ప్రతిస్త్రీలోను ఆత్మశక్తి అణిగి ఉంటుంది. తనలోని ఆత్మశక్తిని ఉద్దీపింపజేసుకుంటే ఏ స్త్రీఅయినా పురుషునితో ఏ రంగంలోనైనా పోటీకి నిలవగలదని నా నమ్మకం.

స్వశక్తిమీద ఆధారపడ్డప్పుడే స్త్రీయొక్క విలువ గౌరవం పురుషలోకానికి తెలియడానికి అవకాశం లభిస్తుంది. దాస్య శృంఖలాలను తెంచుకొని, ఆత్మగౌరవాన్ని పెంపొందింపజేసుకోవడంకంటే స్త్రీకి ఆనందాయకమైన మరో విషయం ఏముంటుంది?

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B144 |
| పుస్తకం పేరు | కదంబమాలిక |
| తారీఖు | 25/10/99 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 84 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిసితి | Good |